ఆంధ్రపత్రిక

చందా వివరములు
ఆంధ్ర దినపత్రిక
సంవత్సర చందా ... 36 00
అర్ధ సంవత్సర చందా ... 14 00
3 మాసముల చందా ... 7 00
నెల చందా ... 2 50
విడి ప్రతి సాధారణదినములలో ... ,, 7
ఆదివారపు దినపత్రిక ... ,, 13
ఆంధ్ర పత్రిక — మద్రాసు-1.

The Andhra Patrika - Madras సంపుటం 44. సంచిక 98 FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO మంగళవారం 9-7-1957 Reg. No. M. 1118 6 పేజీలు 7 నయాపైసలు

# విశ్వవిద్యాలయ విద్యార్థులకు సగం ధరకే పాఠ్యగ్రంథాలు

## భారత ప్రభుత్వ ఆలోచనలో ఉన్నదని దేశ్‌ముఖ్ వెల్లడి

మదరాసు, జూలై 8: విశ్వవిద్యాలయాల విద్యార్థులకు పాఠ్యగ్రంథాలను ఇప్పుడు చెల్లిస్తున్న ధరలో సగంధరకు లభింపజేసే విషయం భారతప్రభుత్వం ఆలోచనలో ఉన్నదని విశ్వవిద్యాలయ విరాళసంఘం అధ్యక్షుడు డాక్టర్ సి. డి. దేశ్‌ముఖ్ చెప్పారు.

డాక్టర్ దేశ్‌ముఖ్ నిన్న మదరాసు విశ్వవిద్యాలయంవద్ద నగర కళాశాలల విద్యార్థి ప్రతినిధులను కలుసుకొని విద్యార్థి సమస్యలను చర్చించారు. పచ్చయప్ప కళాశాల ప్రధానోపాధ్యాయుడు శ్రీ ఆర్. కృష్ణమూర్తి, రిజిస్ట్రార్ శ్రీ ఆర్. రవివర్మ కూడా వున్నారు.

విశ్వవిద్యాలయం విద్యార్థులందరికీ ... సూచించారు.

విశ్వవిద్యాలయంలోని విద్యార్థులందరు ఒకేసంఘంలో వుండటం మంచిదని డాక్టర్ దేశ్‌ముఖ్ అంగీకరించారు. జాతీయ సాంస్కృతికోత్సవాలను వివిధ కేంద్రాలలో జరపాలనే సూచన బాగుందనీ, మదరాసు విశ్వవిద్యాలయం ముందుకు వచ్చేయెడల తప్పకుండా పరిశీలిస్తామని అన్నారు. ...

కళాశాలల్లో అనుభవంకలిగిన ఉపాధ్యాయులు లేరనే విషయంగూర్చి చెపుతూ ఇంజనీరింగు కళాశాలల్లో పనిచేసే ఉపాధ్యాయులకు జీతాలుగూర్చి పరిశీలించటానికి ఒకసంఘం ఏర్పాటైందని చెప్పారు.

# 1956-57 లో ఆదాయపుపన్ను అంచనాలకంటె రు.610 లక్షలు జాస్తి

న్యూఢిల్లీ, జూలై 7: 1956-57 లో ఆదాయపుపన్ను బడ్జెట్ అంచనాలకంటె రు. 610 లక్షలు అధికంగా వసూలైందని అధికారులు ప్రకటించారు.

బడ్జెట్ అంచనాల ప్రకారం ఆసంవత్సరం రు 18960 లక్షలు ఆదాయంపన్ను రావలసివుండగా, రు 19570 లక్షలు వసూలైంది.

వసూలైన యీమొత్తంలో రు 60 కోట్లు రాష్ట్రాలకు పంచి, మిగతా రు 13570 లక్షలను కేంద్రం వినియోగించుకుంటుంది.

1955-56 లో కంటె యీవసూళ్లు రు 1858 లక్షలు ఎక్కువ. లోగడకంటె ఆర్థికపరిస్థితులు మెరుగవటంవల్ల ఆదాయంపన్ను అధికంగా వసూలైనట్లు అధికారులు తెలియజేశారు.

ఆదాయపుపన్ను శాఖ గూడా అంతకుముందు సంవత్సరంకంటె 1956-57లో బాగా పనిచేసింది.

ఈశాఖ జరిపిన తీవ్రకృషిమూలంగా 92707 మంది కొత్తగా పన్ను చెల్లించారు. 105098 అప్పీళ్ళను విచారించటం జరిగింది.

## మరణసుంకాలవల్ల రు. 210 లక్షలు వసూలు

1956-57లో మరణసుంకాల చెందిన అభియోగాలు 7002 నమోదుకాగా 6986 ను విచారించి తీర్పు చెప్పారు. ... రు.210 లక్షలు ...

# హరిజన విద్యార్థులకు వసతిగృహం

## గుంటూరులో తిరిగి ఏర్పాటుచెయ్యాలనివినతి

గుంటూరు, జూలై 6: గత 20 సంవత్సరాలుగా ఇక్కడ కళాశాలలో చదివే హరిజనవిద్యార్థులకు భోజన, వసతి సదుపాయాలు కలిగిస్తున్న వసతి గృహాన్ని మూసివేసినందువల్ల, ఈ సంవత్సరం క్రొత్తగా చేరిన 45 మంది బీదవిద్యార్థులు చాలా ఇబ్బంది పడవలసి వస్తోందనీ, అందువల్ల వసతి గృహాన్ని తిరిగి ఏర్పాటుచెయ్యాలనీ ఆంధ్రప్రదేశ్ ... ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

వసతి గృహంలో గత సంవత్సరం 29 మంది విద్యార్థులు ఉండి చదువుకున్నారు.

# హరిజన, కార్మిక వడలపేర దుబారా

## ఖమ్మంజిల్లాలో అభివృద్ధి కృషి

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

# హరప్పా, మొహంజొదారోల సమకాలీన నాగరకత

## లోథాల్ గ్రామంవద్ద తవ్వకాల్లో లభించిన అవశేషాలు

# న్యాయ కార్యనిర్వహణ శాఖలు

## మిగతా మూడు జిల్లాలలో కూడా విభజన

హైదరాబాదు, జూలై 8: న్యాయ కార్యనిర్వహణ శాఖలను మిగతా మూడు జిల్లాలలో-తూర్పు గోదావరి, కృష్ణా, గుంటూరులలోకూడా వేరుచేసే విషయమై ప్రభుత్వం ఆలోచిస్తున్నదనీ త్వరలోనే నిర్ణయమౌతుందని, న్యాయశాఖ మంత్రి శ్రీ గంధి వెంకటరెడ్డి నాయుడు యివాళ శాసనసభలో, శ్రీ టి. లక్ష్మీనారాయణరెడ్డి ప్రశ్నకు సమాధానమిస్తూ చెప్పారు.

# సిరియాపై ఇజ్రేల్ ఫిర్యాదు

టెల్ అవివ్, జూలై 7: ఇజ్రేల్ సరిహద్దులను సిరియా సైన్యాలు వచ్చి, సమితి పర్యవేక్షక బృందానికి చెందిన కెనడా ప్రతినిధిపైనా, ఒక ఇజ్రేల్ ఉద్యోగిపైనా రెండువ్నర గంటలపాటు మరతుపాకుల ప్రేల్చారనీ, కాని వీరు సమీపంలోని ఇజ్రేల్ శిబిరంలో తల దాచుకున్నారని ఇజ్రేల్ ప్రభుత్వ ప్రతినిధి ఒకరు తెలిపారు. సమితి యుద్ధ విరామ సంఘానికి సిరియాపై ఇజ్రేల్ అధిక్షేపణ తెలియజేసిందని కూడా ఆయన అన్నారు.

# నెహ్రూతో ఇన్‌గ్రిడ్ బెర్గ్‌మన్ సంభాషణ

# బొగ్గుధర టన్నుకు రు $1\frac{1}{2}$ హెచ్చింపు

## కార్మికుల జీతాలను పెంచేందుకు ఏర్పాటు

న్యూఢిల్లీ, జూలై 8: కార్మిక వివాద పరిష్కారాలకు సంబంధించిన అప్పీళ్ళ విచారణసంఘం ఈమధ్య ఇచ్చిన తీర్పు ప్రకారం కార్మికుల జీతాలను పెంచడానికి అన్నిరకాల బొగ్గుధరలను టన్నుకు రు 1-8-0 లను భారత ప్రభుత్వం హెచ్చించింది. ఈ నిర్ణయం నేటినుంచీ అమలులోనికి వస్తుంది.

... సంఘం తీర్పు ప్రకారం కార్మికుల జీతాల వధికం చేసేందుకు అవసరమైన ధనసేకరణ నిమిత్తం ఈ ధరలను పెంచారు. ఈ తీర్పు అస్సాంకు చెందక పోవటంవల్ల, అస్సాంలోని బొగ్గుధరలకు ఈ హెచ్చింపు వర్తించదు. ఐతే, దేశంలో బొగ్గుధరలను పరిశీలిస్తున్న సంఘు కార్యక్రమానికి ఈ హెచ్చింపు వల్ల ఎలాంటి ఆటంకమూ కలుగదు.

# గ్రహం, గ్రహం మధ్య విమానయానం

## అమెరికాలో ప్రయోగాలు

... ఈ ప్రయోగాలు మేరియట్టాలోని లాక్‌హీడ్ విమాన నిర్మాణ కర్మాగారం ఆవరణంలో జరుగుతాయి. అణుశక్తితో నడిచే ఆకాశయానంలో ఐదుగురేసి మనుష్యులు చొప్పున ఎక్కించి, ఈ పరీక్షలు చేస్తారు. ఇందులో ఒక గది వుంటుంది. అందులో అన్ని సౌకర్యాలు వుంటాయి. ఈ రిగురిని అందులో వుండమంటారు. పరీక్షలు ప్రారంభిస్తారు. అయితే ఈ పరీక్షలు జరిగేప్పుడు విమానం పైకి ఎగరదు. నేలను విడిచిపోదు. అట్లా ఈ పరీక్షలు నడిపిస్తారు.

లాక్ హీడ్ విమాన నిర్మాణ కర్మాగారం శాస్త్రవేత్తలు, విశ్వవిద్యాలయాలలో పనిచేస్తున్న మరో పదిమంది శాస్త్రజ్ఞులు ఈ పరీక్షలను చూస్తారు. దొంగమీటలు, కంట్రోళ్లు, అన్నీ పెట్టి, పనిచేస్తారు.

"ఇప్పుడు విమానాలు ఇంతకుముందు ఎప్పుడూ పోనంత ఎత్తుకుపోతున్నాయి. శబ్దంకన్నా కూడా వేగంగా ప్రయాణిస్తున్నాయి. కొత్త కొత్త వాతావరణ పరిస్థితులను తారసిల్లుతున్నాయి. అందువల్ల, అటువంటి ప్రదేశాలలో మనుష్యులు ప్రయాణం చెయ్యగలగటం విషయం ఆలోచించాలి. మనుష్యతత్వాలను ఎరిగి సాధనవిశేషాలను నిర్మించవలసి వుంటుంది." అని డా॥ జాక్ క్రాస్ట అన్నారు.

డా॥ ఓ. ఎస్. ఆడమ్స్, ఇది కొత్తరకమైన ప్రయత్నం అన్నారు. "అత్యల్పమైన ప్రదేశంలో కొంతకాలం పాటు వైమానికబృందం వుండవలసివస్తే పరిస్థితులు, సంగతి సందర్భాలు ఎట్లా వుంటాయో తెలుసుకోవలసివుంది. అందుకే ఈ ప్రయోగం" అన్నారు.

# సుప్రీంకోర్టు, హైకోర్టులలో పని త్వరగా తెమల్చే సంకల్పం

## సెలవులను తగ్గించాలని ప్రతిపాదన

న్యూఢిల్లీ, జూలై 7: సుప్రీంకోర్టు, హైకోర్టులలో పేరుకొని ఉన్న అభియోగాలను త్వరితంగా తెమల్చివేసే సంకల్పంతో, నేటికి యిస్తున్న సెలవులను తగ్గించివేయాలని భారత ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

# ఫ్రెంచి రాజ్యాంగ సంస్కరణ

# పొన్నపల్లి గజదొంగల ముఠా పోలీసుల వశం

## నగలు వస్త్రాలు స్వాధీనం

(ఆంధ్రపత్రిక విలేఖరి)

చెరుకుపల్లి, జూలై 7: రేపల్లె తాలూకా పొన్నపల్లి కాపురస్థుడు భూసిరెడ్డి కట్టి నడుపుతున్న దొంగలముఠా పోలీసులకు పట్టుబడింది. వారివద్ద నగరం గ్రామంలో చోరీ అయిన వెండి బంగారునగలు, వస్త్రాలు దొరికాయని తెలిసింది.

## చెరుకుపల్లి ప్రాంతంలో చోరీలు

ఈ ప్రాంతంలో కొన్ని రోజులుగా దొంగతనాలు ఎక్కువగా జరుగు...

ఈ దొంగతనాల సందర్భంలో, పోలీసులు యిప్పటికి 12 మందిని అనుమానించి నిర్బంధంలో ఉంచారు.

## దొంగతనంగా కలపరవాణా

... ప్రత్యేకం నియమింపబడిన అటవీరక్షణోద్యోగి (ఫారెస్టు గార్డు) ... స్థానిక అటవీరక్షణ ఉద్యోగి రామచంద్రరావు సహాయంతో అకలపను పట్టుకొన్నారు. పడవ స్వాధీనం. చేసుకొని దర్యాప్తు జరుపుతున్నారు.

# సోవియెట్ నాయకుల తొలగింపు టిటోతో రాయబారాలకు నాంది?

## రష్యాతో సంబంధాలలో రాగలమార్పులపై భావన

బెల్‌గ్రేడ్, జూలై 7: స్టాలిన్ అనుయాయులు అయిన సోవియెట్ నాయకుల బర్తరఫ్ జరిగినతరువాత రష్యా, యుగోస్లావియా దేశాలమధ్య కొత్తగా రాయబారాలు సాగించడానికి ప్రాతిపదికగా క్రెమ్లిన్, యుగోస్లావియా అధ్యక్షుడు మార్షల్ టిటోలమధ్య అప్పుడే ఉత్తర ప్రత్యుత్తరాలు నడుస్తున్నట్లు ఇక్కడి రాజకీయవర్గాలవారు విశ్వసిస్తున్నారు.

స్లావ్ అధికారులు ఆశిస్తున్నారు.

పోలండ్, చైనా చూపిన మార్గం అనుసరించి క్రమేణా సోషలిజం నెలకొల్పు కొనడానికి తూర్పు యూరోపు ...

## తూర్పు యూరోపు దేశాలలో పరిస్థితి

## 'స్టాలిన్ అనుయాయులు అందరికి ఉద్వాసన'

(6 వ పుట చూడుడు)

## వడ్డె విద్యార్థుల వసతి గృహం

### బళ్ళారిలో ఏర్పాటు

బళ్ళారి, జులై 5: వడ్డెకులస్థులయిన పేద విద్యార్థుల కోసం కొత్తగా ఒక వసతి గృహానికి పార్లమెంటు సభ్యుడు శ్రీ టేకూరు సుబ్రహ్మణ్యం నిన్న ప్రారంభోత్సవం చేశారు. సభకు బళ్ళారి డెప్యూటీ కమీషనరు శ్రీ టి. వి. రెడ్డి అధ్యక్షత వహించారు. వసతి గృహానికి రు 10 వేలు విరాళంగా ఇచ్చినందుకు శ్రీ వి. నాగప్పను శ్రీ సుబ్రహ్మణ్యం అభినందించారు. ఇతర కులాలకు చెందిన పిల్లలనుకూడా వసతిగృహంలో చేర్చుకోవలసినదిగా పాలకవర్గానికి శ్రీ టి. వి. రెడ్డి సలహాచెప్పారు. వసతి గృహ పాలకవర్గం గౌరవాధ్యక్షుడు శ్రీ విరూపాక్షప్పచెట్టి అతిథులకు స్వాగతం చెప్పారు.

## ముంగండ గ్రామం అభివృద్ధి పనులు

### జిల్లాకలెక్టరు పరిశీలన

ముంగండ, జూన్ 28: పుల్లేటి కుర్రు జాతీయ విస్తరణ కేంద్రం యాజమాన్యాన ఈ గ్రామంలో జరిగిన అభివృద్ధి పనులను జిల్లాకలెక్టరు శ్రీ ఎ. కృష్ణస్వామి యీ వేళ పరిశీలించారు.

కలెక్టరు ఉదయం ఇక్కడకు వచ్చారు. ఆయన వెంట జిల్లా ప్రణాళికా శాఖాధికారి శ్రీ ఎస్. సత్యనారాయణ, పుల్లేటి కుర్రు అభివృద్ధి కేంద్రం అధికారులు వచ్చారు. పంచాయతీ అధ్యక్షుడు శ్రీ సుసర్ల సూర్యనారాయణ వీరందరకు స్వాగతం చెప్పారు.

శ్రీ కృష్ణస్వామి యువజన సమితి కార్యాలయాన్ని, మహిళామండలి నిర్వహిస్తున్న కుట్టుపని, హిందీ శిక్షణ కేంద్రాలను తనిఖీచేశారు. అభివృద్ధి శాఖోద్యోగిని కుమారి వసంతాదేవి, మహిళామండలి నిర్వాహకురాలు శ్రీమతి పి. బాలాత్రిపుర సుందరి, కె. పద్మావతి ఆయనకు స్వాగతం చెప్పారు.

తరువాత నరేంద్రపురం వద్ద రేవడి కాలువపై అభివృద్ధి శాఖ నిర్మించిన వంతెనకు కలెక్టరు ప్రారంభోత్సవం జరిపారు. అక్కడ ఆయనకు పంచాయతీ అధ్యక్షుడు శ్రీ టి. సుబ్రహ్మణ్యం తదితరులు స్వాగతమిచ్చారు.

శ్రీ కృష్ణస్వామి ఇక్కడనుంచి శాఖోలు వెళ్లారు. (స్వ. వి.)

## గ్రామరాజ్య శిక్షణ శిబిరాల నిర్వహణ

విజయవాడ, జులై 2: ఆగస్టులో గ్రామరాజ్య శిక్షణ శిబిరాలు మరికొన్నిటిని రాష్ట్రంలో నిర్వహించాలని భీమవరంలో మొన్నటితో ముగిసిన గ్రామరాజ్య శిక్షణ శిబిరంలో నిశ్చయించారు. అక్టోబరులో మహిళలకు రాష్ట్ర గ్రామరాజ్య శిక్షణ శిబిరం ఒకటి నిర్వహించాలని కూడా నిశ్చయించారు.

శిబిరం వారం రోజులపాటు శ్రీ గోరా నిర్వహించారు. 34 మంది చేరారు. శ్రీ వల్లభస్వామి (సర్వసేవా సంఘ కార్యదర్శి) శ్రీ ఓంప్రకాశ్, శ్రీ మూర్తిరాజు, ప్రసంగాలు చేశారు.

గ్రామరాజ్య కార్యక్రమం ఉత్సాహంగా సాగించాలని కడపజిల్లాలోని గ్రామదానాల తాలూకు గ్రామాలు, మహబూబ్‌నగరం జిల్లాలో దానంగా లభించిన భూముల విషయమై శ్రద్ధ వహించాలని ఆచార్య వినోబాజీ ఒక సందేశం పంపారు.

## కృష్ణాజిల్లా సెషన్సు జడ్జికి వీడ్కోలు

బందరు, జులై 1: జిల్లా సెషన్సు జడ్జి శ్రీ జె. సాంబశివరావు ఉద్యోగ విరమణ సందర్భంలో న్యాయవాద సంఘం మొన్న వీడ్కోలిచ్చింది. శ్రీ యస్. వెంకట సూర్యనారాయణ ప్రసంగిస్తూ శ్రీ సాంబశివరావు న్యాయవాదులపట్ల చూపిన స్నేహభావానికి, న్యాయపాలనలో ప్రదర్శించిన శక్తి సామర్థ్యాలకు అభినందనలు తెలిపారు.

శ్రీ కె. పూర్ణమల్లికార్జునుడు ప్రభృతులు మాట్లాడారు. శ్రీ సాంబశివరావు ఉచిత సమాధానమిచ్చారు.

## గిరిజనులలో విద్యాభివృద్ధి

భద్రాచలం, జులై 1: పాఠశాలల డిప్యూటీ ఇన్‌స్పెక్టరు శ్రీ జి. సత్యం ఏర్పాటుచేసిన విద్యావిషయిక గోష్ఠికి రాష్ట్ర విద్యావిషయిక వివరాల సేకరణ శాఖ పర్యవేక్షక ఉద్యోగి శ్రీ ఎ. జగన్నాధరావు అధ్యక్షత వహించారు. జిల్లాశాఖ ఉద్యోగి శ్రీ ఆర్. చంద్రశేఖరరావు, ఉపాధ్యాయులు, గ్రామ అధికారులు, ప్రముఖులు పాల్గొన్నారు. గిరిజనులలో విద్యాభివృద్ధి గురించి పలువురు ప్రసంగించారు.

శ్రీ చంద్రశేఖరరావు వందన మర్పించారు.

## ఆంధ్రవిశ్వవిద్యాలయ సెనేటుకు ఎన్నిక

నెల్లూరు, జులై 5: నెల్లూరుజిల్లా స్థానిక సంస్థల నియోజకవర్గంనుంచి శ్రీ దువ్వూరు బలరామరెడ్డి ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనేటుకు ఎన్నికైనారు. పంచాయతీ అధ్యక్షులు కొందరు దాఖలుచేసిన అభ్యర్థిపత్రాలు నిరాకరించటం జరిగిన కారణంచేత శ్రీ బలరామరెడ్డి పోటీలేకుండా ఎన్నికైనారు. (స్వ. వి.)

## విజయవాడ పట్టణ కాంగ్రెసు

### జిల్లా సంఘ హోదా ఇవ్వాలని విజ్ఞప్తి

విజయవాడ, జులై 4: విజయవాడ పట్టణకాంగ్రెసు సంఘం శాసనసభ్యుడు శ్రీ మరుపిళ్ళ చిట్టి అధ్యక్షతను క్రిందటి ఆదివారం సమావేశమై, పట్టణ కాంగ్రెసు సంఘానికి జిల్లా కాంగ్రెసు సంఘం హోదా ఇచ్చి, జిల్లా కాంగ్రెసు సంఘంగా రూపొందించాలని ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘాన్ని అభ్యర్థిస్తూ తీర్మానించినది.

ప్రదేశ్ కాంగ్రెసు నియమావళి ననుసరించి జిల్లా కాంగ్రెసు సంఘం ఏర్పరచడానికి చాలినంత జనసంఖ్య ఉన్నదని, రాజకీయ ఆర్థిక సాంఘిక కారణాల దృష్ట్యా విజయవాడకు రాష్ట్రంలో ప్రముఖస్థానం ఉన్నదని, విజయవాడ సంఘానికి జిల్లా కాంగ్రెసు సంఘం హోదా ఇవ్వడం ఉచితమే కాక అవసరమని ఆ తీర్మానంలో సూచించడమైనది. ఇందుకుగాను అవసరమైన చర్యలు జరపడానికి పట్టణ కాంగ్రెసు సంఘం అధ్యక్షునికి అధికారం ఇచ్చినది.

ప్రస్తుతం ఉయ్యూరులో ఉన్న పాలీటెక్నిక్ ఇన్‌స్టిట్యూట్‌ను విజయవాడకు మార్పుచేయమని రాష్ట్రప్రభుత్వాన్ని అభ్యర్థిస్తూ పట్టణ కాంగ్రెసు సంఘం మరొక తీర్మానం చేసినది.

శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు గారి మృతికి సంతాపం వెలిబుచ్చుతూ పట్టణకాంగ్రెసు సంఘం మొదట తీర్మానించినది.

ఈ ఏడాది జూన్ 30 వ తేదీవరకు జమా ఖర్చులు ఆమోదించడమైనది.

## తిరువూరు కేంద్ర కార్యాచరణ సంఘం

విజయవాడ, జులై 3: కృష్ణాజిల్లా కలెక్టరు శ్రీ ఎ. చంద్రశేఖర్ అధ్యక్షతను నిన్న జరిగిన సభలో తిరువూరు జాతీయ విస్తరణ కేంద్ర కార్యాచరణ సంఘం ఏర్పాటు చేయడమైనది. ఈ సంఘంలో ఈ దిగువ సూచించినవారు సభ్యులుగా ఉంటారు: కేంద్ర అభివృద్ధి అధికారి, వైద్యశాఖాధికారి, తిరువూరు తహసీల్ దారు, శ్రీ ఎమ్. వెంకటప్పయ్య, శ్రీ ఎ. బాపిరెడ్డి, శ్రీమతి కొల్లి సీతారామమ్మ, బేసిక్ ట్రెయినింగ్ పాఠశాల తరపున ఒక మహిళ (ఆమెను ప్రధానాధ్యాపకురాలు నియమించవలసి ఉంటుంది), కేంద్ర అభివృద్ధి అధికారి సూచించే మరియిద్దరు మహిళలు.

## తెనాలిలో అనాధ శిశు సంరక్షణాలయం

తెనాలి, జులై 3: నేరాలుచేసే పిల్లలు, అనాధుల సంరక్షణకు గాను తెనాలిలో ఒక అనాధ శిశు సంరక్షణాలయం స్థాపించడానికి డెప్యూటీ కలెక్టరు శ్రీ కె. సత్యనారాయణ అధ్యక్షతను నిన్న ఇక్కడ జరిగిన సభలో తీర్మానించడమైనది.

అనాధ శిశుసంరక్షణాలయం స్థాపించి నిర్వహించే నిమిత్తం ఒక సంఘం ఏర్పరచి రిజిష్టర్ చేయడానికి కూడా సభలో తీర్మానించడమైనది. తాత్కాలిక సంఘానికి ఈ దిగువ సూచించినవారు ఎన్నికైనారు: శ్రీ కె. సత్యనారాయణ-అధ్యక్షుడు, శ్రీ బి. కనకసుందర శర్మ-ఉపాధ్యక్షుడు శ్రీ కె. దామోదరయ్య-కార్యదర్శి శ్రీ ఆర్. రామిరెడ్డి సంయుక్త కార్యదర్శి. శ్రీ వై. వెంకటరావు-కోశాధికారి. శ్రీయుతులు ఎ. గోపాలకృష్ణమూర్తి, ఎమ్. నాగభూషణం, కె. ఆదినారాయణమూర్తి, డి. రత్నయ్య - సభ్యులు తహసీలుదారు, సెషనల్ సబ్ మాజిస్ట్రేట్ కూడా అధికార సభ్యులుగా ఉంటారు. (స్వ. వి.)

## కొత్తపాలెంలో ప్రాచ్యభాషా పాఠశాలకు ప్రారంభం

గూడూరు, జులై 1: కొత్తపాలెం గ్రామంలో నూతనంగా నిర్మించిన శ్రీ దువ్వూరు నారాయణ రెడ్డిస్మారక బోర్డు ప్రాచ్యభాషా మాధ్యమిక పాఠశాలకు జిల్లాకలెక్టరు జనాబ్ మొహిబుల్లా ప్రారంభోత్సవంచేశారు. శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డి అధ్యక్షత వహించారు.

శ్రీ పెళ్లేటి వెంకటకృష్ణారెడ్డి పతాకోత్సవంచేశారు. శ్రీ పెనుబోలు రామశేషారెడ్డి నివేదిక చదివారు. భవన నిర్మాణానికి కీ॥ శే॥ నారాయణరెడ్డి గారి అల్లుళ్లు రు 7 వేలు, శ్రీ రామకృష్ణారెడ్డి రు 16 వేలు విరాళాలిచ్చారని తెలిపారు.

అధ్యక్షులు మాట్లాడుతూ మైకా వ్యాపారస్థులపై పన్నులభారం పెరుగుతోందని, అయినా దానాలకు ధర్మాలకు వెచ్చించే సొమ్మును మినహాయిస్తున్నందుకు ప్రభుత్వాన్ని అభినందించాలని అన్నారు. ప్రభుత్వ కార్యాలయాలలో పనులు త్వరగా తెమలడం లేదన్నారు.

జనాబ్ మొహిబుల్లా ప్రసంగిస్తూ సంస్కృతి పాఠశాలల ముఖ్యం వివరించారు, శ్రీ పెనుబోలు వెంకట్రామరెడ్డి శ్రీ వెంకట కృష్ణారెడ్డి పాఠశాల స్థాపనకు జరిగిన కృషిని తెలిపారు.

పంచాయతీ సభ్యులు వినతి పత్రాలు సమర్పించారు.

శ్రీ కొత్తరఘురామయ్య, (రక్షణ శాఖ ఉప మంత్రి) ఇటీవల గుంటూరు వచ్చినపుడు పట్టణ పత్రికారచయితల సంఘం విందుచేశారు.

## గుంటూరుజిల్లా రైతుల సమస్యలు

### రివెన్యూమంత్రికి విజ్ఞప్తి

హైదరాబాదు, జులై 6: నాగార్జునసాగరం నిర్మాణంలో పుల్లారెడ్డి గూడెం, పల్లగూడెం గ్రామాలు పూర్తిగా మునిగిపోతాయి. అందువల్ల ఈ గ్రామాలకు చెందిన సుమారు 800 కుటుంబాలవారికి కొండ్లగుంట అడవి ప్రాంతంలో పునరావాసం కల్పించాలని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య నాయకత్వాన శ్రీయుతులు ఎం. నాగిరెడ్డి, వై. వి. కృష్ణరావు, టి. గోవిందయ్య మొదలైనవారు రివెన్యూమంత్రి శ్రీ కళా వెంకట్రావును కలుసుకుని విజ్ఞప్తిచేశారు.

ప్రతినిధివర్గం మంత్రికి వినతిపత్రం సమర్పించింది. దానిలో ఇంకా ఇలా ఉంది: "కృష్ణలంకలలో 100 ఎకరాలకు మించి సాగైనభూమి ఉన్న గ్రామాలలో మూడెకరంకు భూమిని వేలం వెయ్యాలని ప్రభుత్వం 1957 మే నెల 29 వ తేదీన జారీచేసిన ఉత్తరువులను ఉపసంహరించుకోవాలి. ప్రాజెక్టుల నిర్మాణానికి ముందు ఎప్పుడో అవసరమవుతాయనే నెపంతో కొన్నిచోట్ల బంజరుభూములను పేదప్రజలకు పంచలేదు. ఒకవేళ వీటి నిర్మాణాలు కొనసాగినట్లయితే తిరిగి తీసుకునే షరతుమీద ఆ భూములను వెంటనే పంచాలి. మరికొన్నిచోట్ల ఉన్న బంజర్లను కొందరు రెండుతరాలనుంచీ సాగుచేసుకుంటున్నా ఇంతవరకూ పట్టాలు ఇవ్వలేదు. కొన్ని సందర్భాలలో కౌలుదారులు పెట్టుకున్న దరఖాస్తులను ప్రభుత్వం ఏదో ఒక అభ్యంతరంచూపి త్రోసిపుచ్చుతోంది. ఈ విషయాలన్నీ శ్రద్ధగా పరిశీలించాలని మనవి."

మంత్రి తమ సమాధానంలో లంక భూముల విషయంలో 1957 మే నెల 29 వ తేదీన ప్రభుత్వం జారీచేసిన ఉత్తరువులవల్ల గోదావరి లంకలలోని సహకారసంఘాలకు లాభించిందనీ, కృష్ణలంకలలో సహకార సంఘాలకిచ్చిన భూములను వేలంవేయక తప్పదనీ అన్నారు. అయినా ఈ విషయాన్ని మంత్రివర్గ పరిశీలనకు నివేదిస్తామని హామీ ఇచ్చారు.

కౌలుదార్లు పెట్టుకున్న దరఖాస్తులలో కేవలం నిబంధనలకు సంబంధించిన అభ్యంతరాలవల్ల త్రోసిపుచ్చినవాటిని పునః పరిశీలిస్తామనికూడా మంత్రి మాట ఇచ్చారు.

## ఇంజనీరింగ్ పట్టభద్రులకు ఉపకారవేతనాలు

హైదరాబాదు, జులై 4: ప్రత్యేక శిక్షణపొందేవారికి ఉపకారవేతనం (స్టైఫండ్) ఇచ్చేపథకాన్ని 1957-58 సం॥లోకూడా కొనసాగించడానికి భారతప్రభుత్వం నిశ్చయించింది. ఈపథకంక్రింద ఈశిక్షణపొందే ఇంజనీరింగ్ పట్టభద్రులకు నెలకు రు 150 ల చొప్పున ఇస్తారు. శిక్షణ 1957 సెప్టెంబరు 1 వ తేదీన ఆరంభమై సుమారు ఒకసంవత్సరంవరకు జరుగుతుంది.

అఖిలభారత శిక్షణసంస్థలలో అయితే ప్రతిసంస్థలోను ఒకఅభ్యర్థిచొప్పున, ప్రాంతీయ శిక్షణసంస్థలలో అయితే ప్రతిసంస్థలోను ఇద్దరు అభ్యర్థుల చొప్పున నామినేటు చేయబడతారు.

మద్రాసులోని విద్యామంత్రిత్వశాఖ, శాస్త్రీయపరిశోధనల దక్షిణ ప్రాంత కార్యాలయానికి దరఖాస్తులు చేరవలసిన చివరిరోజు 1957 జులై 8 వ తేదీ.

### వెనుకబడిన తరగతి

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని ఆంధ్ర ప్రాంతవిషయంలో సాంఘిక సంక్షేమం, కార్మికశాఖచే నిర్వహించబడుతున్న వెనుకబడిన తరగతుల జాబితాలో శివకరణం కులాన్నికూడా చేర్చడానికి ప్రభుత్వం ఆదేశించింది.

## ఉస్మానియా విశ్వవిద్యాలయం పరీక్షలు

హైదరాబాదు, జులై 4: 1957 అక్టోబరునెలలో జరుగు ఉస్మానియా విశ్వవిద్యాలయం పరీక్షలకు రుసుం దాఖలుచేయవలసిన చివరిరోజు జులై 6 వ తేదీ. పైపరీక్షలకు హాజరౌదలిచే అభ్యర్థులు జులై 6 తరువాత రోజుకు ఒకరూపాయి విలంబసుల్కం చొప్పున జులై 18 వ తేదీ శనివారంవరకు పరీక్షరుసుం కట్టుకోవచ్చు.

## ఆంధ్ర ప్రదేశ్‌లో పంచదార ఉత్పత్తి

### ఇప్పటికి లోటులేదని ముఖ్య మంత్రి వివరణ

హైదరాబాదు, జులై 6: ఆంధ్రప్రదేశ్‌లో ఇప్పటికి మొత్తం 9 పంచదార ఫ్యాక్టరీ లున్నాయని ఇవిగాక మరో నాలుగు నిర్మాణ మవుతున్నాయని, ఇప్పుడున్న ఉత్పత్తి సాగిస్తున్న 9 ఫ్యాక్టరీలలోనూ, 8 వ్యాపారస్థుల యాజమాన్యంలోనూ, ఒకటి సహకార సంఘం ఆధ్వర్యాన నడుస్తున్నాయని, ముఖ్య మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ఇవాళ శాసన సభలో చెప్పారు.

శ్రీ ఎం. నాగిరెడ్డి ప్రశ్నకు సమాధానమిస్తూ, రాష్ట్రంలో సాలీనా 2 లక్షల 80 వేల టన్నుల పంచదార ఉత్పత్తి అవుతుందని, నిర్మాణంలో ఉన్న నాలుగు ఫ్యాక్టరీలు, నిర్మాణానికి అనుమతి పొందిన మరో 5 ఫ్యాక్టరీలు ఉత్పత్తి ప్రారంభిస్తే అదనంగా 80 వేల టన్నుల పంచదార లభిస్తుందని, ప్రస్తుతానికి పంచదారకు లోటేమీ లేదని, ముఖ్య మంత్రి చెప్పారు. బెల్లము ఖాండసారి, ఎప్పటి కప్పుడు తగినంతగా లభ్యమవడంపై పంచదార గిరాకీ ఆధారపడి ఉంటుందని కూడా ఆయన తెలియజేశారు.

శ్రీ విశ్వేశ్వరరావు అడిగిన ప్రశ్నకు ముఖ్య మంత్రి జవాబిస్తూ, ఆంధ్రతెలంగాణాలలో 1953-54 నుంచి 55-56 వరకూ పంచదార చెరకుపై సెస్సు రూపంలో రు. 80 లక్షలు వసూలు అయినట్లు వెల్లడించారు.

## జంటనగరాల్లో కళాశాలలు

### జులై 15 న ప్రారంభం

హైదరాబాదు, జులై 6: హైదరాబాదు, సికిందరాబాదు నగరాలలో, కళాశాలలను జులై 15 న తెరుస్తున్నట్లు యివాళ అధికారప్రకటన వెలువడింది. శీతజ్వరవ్యాప్తి నిరోధ చర్యగా అందాకా వాయిదా వేశారు. ఉదయం మధ్యాహ్నం సినిమా ప్రదర్శనలకు ఈతి కాసారాలకు సంబంధించిన నిషేధపుటుత్తర్వులు ఇంకా అమల్లో ఉంటాయి.

## హైదరాబాదు ఓటర్ల జాబితా

హైదరాబాద్, జులై 6: హైదరాబాదు నగరసోషలిస్టు పార్టీ కార్యదర్శి శ్రీ బి. సత్యనారాయణరెడ్డి, యీదిగువ ప్రకటన చేస్తున్నారు.

"నగరంలో ఓటర్ల జాబితాను సరిదిద్దుతున్నారు. జాబితాలో కనిపించని పేర్లను ఎక్కిస్తున్నారు. భారత రిపబ్లిక్‌లో ప్రతి పౌరునికి ఓటు హక్కున్నది. ఓటర్ల జాబితాలో తమ పేర్లను నమోదు చేయించుకోడంలో అందుకు సంబంధించిన అధికార్లతో సహకరించాలి. దరఖాస్తు ఫారములు ఇంగ్లీషులో అచ్చువేసి ఉండడంవల్ల, ఆభాష తమకు తెలియనందున చాలామంది యీ ఓటర్ల జాబితా తయారుచేసే పనిలో అధికార్లకు తోడ్పడడం లేదని తెలిసింది. కాబట్టి ప్రభుత్వం వెంటనే యీ జాబితాను తెలుగు, ఉర్దు, హిందీ మొదలైన ప్రాంతీయ భాషలలో అచ్చువేయించాలి" ఇది చాలా అవసరం."

## అమలాపురం తాలూకా ఉపాధ్యాయ సంఘం

ముమ్మిడివరం, జులై 1: అమలాపురం తాలూకా ప్రాథమికోపాధ్యాయ సంఘం నిన్న ఇక్కడ శ్రీ పి. దుర్గారావు అధ్యక్షతన సమావేశమై కేంద్ర ప్రభుత్వం సూచించినప్రకారం తమకు జీతాలివ్వాలనీ, విద్యార్థుల సగటు హాజరు సంఖ్యను తగ్గించాలనీ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరారు.

ఇటీవల ప్రభుత్వం మంజూరు చేసిన అదనపు కరువు భత్యం రు 6 ఇంకా జిల్లా బోర్డు వారు ఇవ్వటం ప్రారంభించనందున ఈ విషయంలో ప్రత్యేకాధికారి శ్రద్ధ వహించి వెంటనే దానిని ఇప్పించాలనీ, రెండు సంవత్సరాలు పనిచేసిన ఉపాధ్యాయులనందరినీ ఖాయంచేసి జీతాల పెంపుదలను వర్తింపచెయ్యాలనీ కూడా సమావేశంలో విజ్ఞప్తి చేశారు.

## భద్రాద్రి పడవ ప్రమాద నివేదిక

### పత్రికల్లో ప్రచురణపై శాసనసభలో ప్రశ్నలు

హైదరాబాదు, జులై 6: భద్రాద్రి పడవ ప్రమాద విచారణసంఘం నివేదికను శాసనసభలో సభ్యులకు అందజేయకముందే, ఆనివేదిక భాగాలను, పత్రికలు ప్రచురించడం, శాసనసభ హక్కులను భంగంచేసినట్లుకాదా? అని సోషలిస్టుసభ్యుడు శ్రీ బి. రామమూర్తి ఇవాళ శాసనసభలో సభాపతిని అడిగారు.

ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి, యీ విచారణసంఘాన్ని శాసనసభ నియమించలేదని, ప్రభుత్వమే నియమించిందని, కాబట్టి, శాసనసభహక్కులకు భంగమన్న ప్రశ్నే లేదని చెప్పారు.

ముఖ్యమంత్రి అభిప్రాయంతో సభాపతి ఏకీభవించి, శాసనసభ హక్కులకు కలిగిన భంగమేమీ లేదని చెప్పారు.

## ఎరువుగా ఉపయోగించే ఆకులపై పన్ను

భద్రాచలం, జులై 2: రిజర్వు అడవులనుంచి రైతులు ఎరువుగా ఉపయోగించే నిమిత్తం ఏరితెచ్చే ఆకులపై బండి ఒంటింటికీ రు 0-4-0 చొప్పున రాష్ట్రమంతటా వసూలు చెయ్యాలని ప్రభుత్వం నిర్ణయించిందని తెలుస్తోంది.

ఇదివరకు ఈ ఆకులపై ఆంధ్రప్రాంతంలో రు 0-12-0 నుంచీ రు 1 వరకు, తెలంగాణా ప్రాంతంలో రు 0-8-0 నుంచీ రు 2 లవరకు బండి ఒకటింటికీ పన్నుగా వసూలు చేసేవారు.

ప్రజలు అడవులలోని ముళ్లకంచెలను ఉచితంగా వినియోగించుకోవటానికి ప్రభుత్వం అనుమతించిందని కూడా విశ్వసనీయంగా తెలిసింది. (స్వ. వి.)

## భిక్‌నూరు మాధ్యమిక పాఠశాల

హైదరాబాదు, జులై 4: భిక్‌నూరు మాధ్యమిక పాఠశాలలో ఎనిమిదవ తరగతి ప్రారంభోత్సవం సోమవారం జరిగింది. సభకు శ్రీ ధన్సీలాల్ పటేల్ అధ్యక్షతవహించి పాఠశాలలో పైతరగతులను ఏర్పాటు చేసేందుకు రు 116 విరాళం ఇచ్చారు. ఇతర ప్రాంతాలనుంచి వచ్చే విద్యార్థులకోసం వసతి గృహాన్ని పాఠశాల విద్యాసంఘం కట్టిస్తుందని శ్రీ విశ్వనాథ గుప్త చెప్పారు.

## రాజమండ్రిలో ప్రాచ్యభాషా కళాశాల

రాజమండ్రి, జులై 3: ప్రాచ్యభాషా కళాశాల నేటినుంచి శ్రీగౌతమీ విద్యాపీఠం ఆధ్వర్యాన ప్రారంభమైనది. ఉదయం గాయత్రీజపం, గణపతి పూజ చేశారు. ప్రారంభంలో వేదపఠనం చేశారు.

వ్యవస్థాపక కార్యదర్శి శ్రీ కె. జె. గోపాలరావు సంస్థ చరిత్ర, కళాశాల స్థాపన కృషి వివరించారు. కళాశాలకు గుర్తింపు ఇస్తూ ఆంధ్ర విశ్వకళాపరిషత్తు జారీచేసిన ఉత్తర్వును చదివారు. శ్రీ వాసా అప్పయ్య శాస్త్రిని కళాశాల ప్రధానాచార్యులుగా విద్యాపీఠం నియమించినట్లు తెలిపారు.

శ్రీయుతులు వీరఘంట సత్యనారాయణశాస్త్రి, చిర్రావూరి అనంతపద్మనాభశాస్త్రి, గోరుగంటి కృష్ణమూర్తి, ధూళిపాళ వెంకట్రామయ్య, వంగవీటి శివయ్యశాస్త్రి, భగవతీ గౌరీనాథం, రంప శంకరశాస్త్రి, ప్రభృతులు యీ కార్యక్రమంలో కళాశాల పురోభివృద్ధిని కాంక్షిస్తూ ప్రసంగించారు.

తరువాత మొదటి సంవత్సరానికి విద్యార్థులను చేర్చుకున్నారు, సుమారు 30 మంది చేరారు.

## కుమారప్పమృతికి సంతాపం

పురపాలకసంఘం శ్రీ కె. నరసింహారావు అధ్యక్షతన మొన్న సమావేశమై శ్రీ భరతన్ కుమారప్పమృతికి సంతాపం వెల్లడించి సభను వాయిదావేశారు. (స్వ. వి.)

## ఆళ్ళగడ్డలో మహిళా సంక్షేమం

### కుట్టు, చేతిపనుల కేంద్రం ఏర్పాటు

ఆళ్ళగడ్డ, జులై 6: ఆళ్ళగడ్డ అభివృద్ధిశాఖ ఆధ్వర్యాన చేతిపనులూ, కుట్టుపని నేర్పే కేంద్రానికి కర్నూలు జిల్లా మహిళా సంక్షేమశాఖాధికారిణి కుమారి నవనీతం ప్రారంభోత్సవము చేశారు. సభకు డాక్టరు ఎస్. జె. శామ్యూల్ అధ్యక్షత వహించారు. జీవాభ్యున్నతి కార్యక్రమాలలో పురుషులతోపాటు కృషి చేయవలసినదిగా మహిళలకు కుమారి నవనీతం విజ్ఞప్తి చేశారు. శ్రీయుతులు సయ్యద్ అహమ్మదు, ఎస్. చిదంబరయ్య గారలు ప్రసంగించారు.

ఈ కేంద్రాన్ని ఏర్పాటు చేయించే విషయమై శ్రీయుతులు పుల్లారెడ్డి, కాంతారావు, కె. ఆర్. వెంకటాద్రి రావు గారలు కృషి చేశారు.

## తాత్కాలికసహాయాన్ని ప్రకటించాలి

### రాయలసీమ గ్రామోద్యోగుల కోరిక

అనంతపురం, జులై 5: జమాబందిలో గ్రామాధికారులు పాల్గొని ఉద్యోగులతో హృదయపూర్వకంగా సహకరించడానికి వీలుగా గ్రామోద్యోగులకు తాత్కాలిక సహాయాన్ని ప్రకటించవలసినదిగా ప్రభుత్వానికి అనంతపురంలో జరిగిన అవసర సమావేశంలో రాయలసీమ గ్రామోద్యోగులు విజ్ఞప్తి చేశారు. ఈకోరిక నెరవేరేదాకా జమాబందీ పనిలో పాల్గొనరాదని నిర్ణయించారు.

## మిస్సుల సూర్యనారాయణమూర్తి సన్మానం

యలమంచిలి, జులై 5: గోలుగొండ పార్లమెంటరీ నియోజకవర్గంనుంచి ఎన్నికైన శ్రీ మిస్సుల సూర్యనారాయణమూర్తికి పట్టణ కాంగ్రెసు ఆధ్వర్యాన సన్మానం జరిగింది.

సభకు శ్రీ గుంటూరు శ్రీహరి అధ్యక్షత వహించారు. శ్రీ అప్పలవీరభద్రం శ్రీ సూర్యనారాయణమూర్తికి సన్మాన పత్రం సమర్పించారు.

శ్రీ సూర్యనారాయణమూర్తి తమకు జరిగిన గౌరవానికి కృతజ్ఞత వెల్లడించి ప్రభుత్వం క్రొత్తగా విధించిన పన్నులను గూర్చీ, భారత, పాకిస్తాన్ దేశాల సంబంధాలను గూర్చీ, తదితర విషయాలనుగూర్చీ వివరించారు. నియోజకవర్గంలోని ప్రజలు సంఘాలను ఏర్పాటు చేసుకుని తమ కోరికలను తీర్మానాల రూపంలో ప్రకటిస్తే తన శక్తివంచన లేకుండా వాటిని నెరవేర్చేందుకు కృషి చేస్తానని ఆయన మాట ఇచ్చారు. (స్వ. వి.)

## రాజంపేట నీరా సహకార సంఘం

రాజంపేట, జులై 4: రాజంపేట నీరా సహకార సంఘం సమావేశం ఈ నెల 2 వ తేదీన, శ్రీ మలిశెట్టి సిద్దయ్య అధ్యక్షతన జరిగింది. శ్రీయుతులు డి. వి. చలపతి, మలిశెట్టి నరసయ్య, గంగరాజు ఈశ్వరయ్య మొదలయినవారు సమావేశానికి వచ్చారు. ఈ క్రింది పాలకవర్గం ఎన్నికయినారు. అధ్యక్షుడు-శ్రీ దాసరి సుబ్బారాయుడు కార్యదర్శి-శ్రీ బి. యల్లయ్య, కార్యవర్గ సభ్యులు-శ్రీయుతులు చి. చిన్న గంగయ్య, జి. చిన్న నాగయ్య, కె. వెంకటసుబ్బయ్యగారలు.

## పెల్లూరులో గ్రామనాయక శిక్షణ శిబిరం

ఒంగోలు, జులై 4: అమ్మనబ్రోలు సమాజవికాస కేంద్ర అధికారులు పెల్లూరులో నాలుగురోజులపాటు గ్రామనాయక శిక్షణశిబిరం నిర్వహించారు. పార్లమెంటు సభ్యుడు శ్రీ కొండా నారపరెడ్డి శిబిరానికి ప్రారంభోత్సవం జరిపారు. శిబిరంనడచిన నాలుగురోజులు వివిధ శాఖల అధికారులు ఆయా శాఖలకు సంబంధించిన విషయాలు గురించి ఉపన్యసించారు. (స్వ. వి.)

## నాగర కర్నూలులో అష్టావధాన ప్రదర్శన

నాగర కర్నూలు, జులై 1: బ్రహ్మశ్రీ పోశూరి కాశీపతి అవధానిగారు మొన్న అష్టావధానం, చిత్రకవితా ప్రదర్శనం చేశారు. శ్రీ రాఘవాచారి పురాణపఠనం చేశారు. పంచాంగ పఠనం, సమస్యాపూరణం, మొదలగు కార్యక్రమాలలో శ్రీయుతులు వీరభద్రయ్య, చెరువు రంగారావు పట్వారి, నాగమూర్తి, రామకృష్ణశర్మ, జానపాటి సత్యనారాయణ, నరసింగరావు, పాల్గొన్నారు.

నరువాడు మాటపదహార్లు, నూతన వస్త్రాలతో కాశీపతి అవధాని గారికి సన్మానం జరిగింది.

## చెరుకుపల్లి పరిసర గ్రామాలలో దొంగతనాలు

చెరుకుపల్లి, జులై 2: నగరం గ్రామంలో శ్రీ మద్ది కోటరాటయ్య ఇంటికి ఎవరో కన్నంవేసి ప్రవేశించి రు 3 వేల సొమ్ము అపహరించారు. గుళ్లపల్లి గ్రామంలో శ్రీ బొమ్మిడి సత్యనారాయణ ఇంట్లో రు 1000 సొమ్ము దొంగిలించారు. దర్యాప్తు సాగుతోంది. (స్వ. వి.)

## అమలాపురం తపాలా ఉద్యోగుల సంఘం

### సమ్మె చెయ్యటానికి సంసిద్ధత

అమలాపురం, జులై 2: అఖిల భారత తంతి తపాలా ఉద్యోగుల సమాఖ్య ప్రభుత్వంతో నిర్వహించిన సంప్రదింపులు విఫలమైనందున సమాఖ్య కార్యవర్గం సిఫార్సు చేసిన ప్రకారం తాము సమ్మెచేయటానికి సిద్ధంగా ఉన్నామనీ ఈ విషయమై జులై రెండవ వారంలో ఢిల్లీలో జరుగనున్న అఖిల భారత తంతి తపాలా ఉద్యోగుల సమావేశం తుదినిర్ణయానికి రావాలనీ, పట్టణ తపాలా శాఖ తృతీయ శ్రేణి ఉద్యోగుల సంఘం గత నెల 30 వ తేదీన జరిగిన ద్వితీయ వార్షిక సమావేశంలో విజ్ఞప్తి చేసింది.

సమావేశానికి శ్రీ జి. నాగభూషణం అధ్యక్షత వహించారు.

తంతి తపాలా ఉద్యోగుల సమాఖ్య నిర్ణయించే కార్యక్రమాలను అమలు జరపటానికి సభ్యులంతా సమాఖ్య నిధికి విరాళాలివ్వాలనీ, పార్లమెంటు సభ్యులు ప్రజాసంస్థలు, తంతి తపాలా ఉద్యోగుల న్యాయమైన కోరికలను సమర్థించాలనీ సమావేశం కోరింది.

పట్టణ తపాలా ఉద్యోగుల సంఘం నూతన కార్యవర్గానికి దిగువవారు ఎన్నికయ్యారు. శ్రీయుతులు ఎస్. రెడ్డి నాయుడు (అధ్యక్షుడు), డి. వి. కృష్ణరావు, జి. నాగభూషణం, ఎం. నరసింహం, ఎం. వి. ఎస్. ఎస్. ఆర్. మూర్తి (ఉపాధ్యక్షులు), సయ్యద్ మహబూజ్ అలీ (కార్యదర్శి), పి. హనుమంతరావు (కోశాధికారి), కె. వి. ఎల్. ఎన్. మూర్తి (సహాయకోశాధికారి), జయంత్ (నిర్వహణ కార్యదర్శి), ఎ. గాతమేశ్వర రావు (ఆడిటర్), సయ్యద్ మహబూబ్ అలీ (సర్క్యుల్ కౌన్సిలర్) వి. వి. రమణమూర్తి, ఎం. నారాయణమూర్తి, (సభ్యులు). (స్వ. వి.)

## ముదునూరి రాజగోపాల రాజు మృతి

ఆత్రేయపురం, జులై 4: మహాత్మాగాంధీ ఉన్నత పాఠశాల నిర్వహణ సంఘ అధ్యక్షుడు శ్రీ ముదునూరి రాజగోపాలరాజు, నిన్నరాత్రి హఠాత్తుగా మరణించారు.

చనిపోయేసరికి శ్రీ రాజు వయస్సు 67 సంవత్సరాలు. ఉన్నతపాఠశాల భవననిర్మాణానికి వీరు స్వయంగా రు. 6 వేలు విలువచేసే రెండు ఎకరాల భూమినిచ్చి, దాదాపు రు. 120 వేలు విరాళంగా సేకరించారు. ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంనుంచీ చనిపోయేవరకూ అనేక ప్రజాహిత కార్యక్రమాలలో పాల్గొని గ్రామాభివృద్ధికి చాలా తోడ్పడ్డారు.

శ్రీ రాజు ఈ పంచాయతీకి 18 సంవత్సరాలు అధ్యక్షుడుగాను, శ్రీ రాజరాజేశ్వరీ ఆలయానికీ, శ్రీ వేణుగోపాలస్వామి ఆలయానికి 20 సంవత్సరాలు ధర్మకర్తగాను కూడా వ్యవహరించారు.

## గ్రామోద్యోగులకు తాత్కాలిక సహాయం

### పి. వి. శివయ్య విజ్ఞప్తి

తెనాలి, జులై 3: గ్రామోద్యోగుల మహాసభ నెల్లూరు నిర్ణయాన్ని ప్రశంసిస్తూ రామమూర్తి సంఘం, కృష్ణస్వామి సంఘం, నివేదికల సంగతి ఏమయినగాని, ప్రభుత్వం నియమించే గ్రామోద్యోగుల సమస్యల విచారణ సంఘ నివేదిక పట్ల కూడా అంతే శ్రద్ధ చూపతారని, శ్రీ పి. వి. శివయ్య తమ అభిప్రాయం ప్రకటిస్తూ కనీసం తాత్కాలిక సహాయమైనా చేయాలని విజ్ఞప్తి చేశారు. మద్రాసు, కేరళ, ప్రభుత్వాలు గ్రామోద్యోగులపట్ల చూపుతున్న శ్రద్ధను అభినందిస్తూ ఆంధ్ర ప్రభుత్వం చూపే అలక్ష్యానికి విచారం వెల్లడించారు.

## మోతే వేదకుమారికి బాపట్లలో సన్మానం

బాపట్ల, జులై 5: పట్టణ వైశ్య యువజనసంఘం ఆధ్వర్యాన నిన్న పార్లమెంటు సభ్యురాలు శ్రీమతి మోతే వేదకుమారికి సన్మానం జరిగింది.

సభకు డాక్టరు ఎస్. వి. చలపతి రావు అధ్యక్షత వహించారు. శ్రీ బొమ్మిశెట్టి సూర్యనారాయణ ప్రార్థన గీతం గానం చేశారు. శ్రీ బి. రాఘవయ్య శ్రీమతి వేదకుమారికి సన్మానపత్రం, నూతన వస్త్రాలు సమర్పించారు. శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, సన్మానితురాలి గుణగణాలను, ఆమెతండ్రి శ్రీ మోతే నారాయణరావు దేశసేవను ప్రస్తుతించారు. శ్రీ అవుల సుబ్బారావు మాట్లాడుతూ ఆహారధాన్యాలధరలు విపరీతంగా పెరిగినందువల్ల మధ్యతరగతి ప్రజలు చాలా ఇబ్బంది పడవలసి వస్తోందనీ, పైపెచ్చు ప్రభుత్వం పన్నులు హెచ్చించి మరికొన్ని ఇబ్బందులను కల్పించిందనీ అన్నారు. కాకినాడ-కాశీపేటల మధ్య క్రొత్తగా ఒక రైలు మార్గం వేయటం అవసరమనీ, అందుకు శ్రీమతి వేదకుమారి పార్లమెంటులో కృషి చెయ్యాలనీ ఆయన కోరారు.

శ్రీమతి వేదకుమారి తమకు జరిగిన సన్మానానికి కృతజ్ఞత వెల్లడిస్తూ రైలు మార్గం ఏర్పాటు చేయించేందుకు తమ శక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తామన్నారు.

శ్రీ వేములచేవర్తి వందనసమర్పణం చేశారు. (స్వ. వి.)

## ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనేట్

వాల్తేరు, జులై 6: ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనేట్‌కు నెల్లూరు జిల్లా స్థానికసంస్థల నియోజకవర్గం నుంచి మైపాడు గ్రామపంచాయతీ అధ్యక్షుడు శ్రీ దువ్వూరు బలరామరెడ్డి ఎన్నికయ్యారని రిజిస్ట్రార్ ప్రకటించారు.

సెనేట్‌కు తిరిగి ఎన్నికలు జరిగే వరకు శ్రీ బలరామరెడ్డి సభ్యుడుగా వ్యవహరిస్తారు.

## బ్రిటన్‌లో భారతీయ కార్మికులు

### శ్రీ నెహ్రూకు ప్రతినిధివర్గం విన్నపం

లండన్, జూలై 6: బ్రిటన్‌లో పని చేస్తున్న భారతీయ కార్మికులు, తమ కోసం కొన్ని శ్రేయః కేంద్రాలను, విద్యాసౌకర్యాలను, ప్యాసుపోర్టు సౌకర్యాలను సమకూర్చవలసిందని, ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూను, స్వయంగా, ఒక మహజరును సమర్పించుకున్నారు. శ్రీ నెహ్రూ ఈ కోర్కెను ఉదారంగా పరిశీలించగలమని హామీ ఇచ్చారు.

ఈ కార్మికుల తరఫున ఒక ప్రతినిధి వర్గం మొన్న గురువారంనాడు ప్రధాన మంత్రిని కలుసుకుని, ఈ విన్నపాన్ని సమర్పించుకుంది. శ్రీ నెహ్రూ తన విన్నపాన్ని ఆలకించి, తమ కోర్కెల సంగతి విచారిస్తామని మాట ఇచ్చినట్లు నేడు ఈ కార్మికుల సంఘం ప్రకటించింది.

భారత ప్రభుత్వం అనుసరిస్తున్న సర్వవిధానాలను తాము బలపరుస్తున్నట్లుగా కూడా ఈ సంఘంవారు తమ ప్రకటనలో పేర్కొన్నారు.

## నెహ్రూతో బ్రిటిష్ ఆర్థిక మంత్రి మంతనాలు

లండన్, జూలై 6: బ్రిటిష్ ఆర్థిక మంత్రి శ్రీ పీటర్ థారన్‌క్రాఫ్ట్ నేడు ప్రధానమంత్రి శ్రీ నెహ్రూను కలుసుకొని మాట్లాడారు.

భారతదేశానికి పంచవర్ష ప్రణాళిక ఖర్చుల నిమిత్తం బ్రిటన్ అప్పు ఇవ్వడాన్ని గూర్చి ఈమధ్య మంతనాలు జరుగుతున్నాయి. అందువల్ల ఇప్పుడు శ్రీ థారన్‌క్రాఫ్ట్-శ్రీ నెహ్రూ సమావేశం, ఇందును గూర్చే జరిగివుంటుందని పరిశీలకులు భావిస్తున్నారు.

శ్రీ థారన్‌క్రాఫ్ట్ వచ్చి, మాట్లాడి వెళ్లిన అనంతరం, భారత ఆర్థికశాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ హెచ్. ఎం. పటేల్, ప్రధానమంత్రి శ్రీ నెహ్రూను కలుసుకొని మాట్లాడారు. బ్రిటన్, భారతదేశానికి ఇవ్వగల అప్పును గూర్చి ఇకముందు మంతనాలన్నీ, శ్రీ పటేలే సాగించగలరని అనుకుంటున్నారు.

## నెహ్రూ-సుక్రుమా సమాలోచనలు

లండన్, జూలై 6: ఘనా ప్రధాన మంత్రి శ్రీ క్వామెసుక్రుమా, భారత ప్రధానమంత్రి శ్రీ నెహ్రూతో మూడోసారిగా సమాలోచనలు నేడు జరిపారు. ఇంతకు పూర్వం 2 సార్లు వీరి ద్దరి మధ్య మంతనాలు జరిగాయి.

శ్రీ సుక్రుమాను, ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ నేడు భోజనానికి పిలిచారు. ఈ భోజనాలముందే, ఈ సమాలోచనలు జరిగాయి.

## కమ్యూనిజంపై శంక

### చైనా మంత్రి ఒప్పుకోలు

పెకింగ్, జూలై 6: చైనా కమ్యూనిస్టు పార్టీని విమర్శించి, సోషలిజం అంటే అనుమానాలు వెల్లడించిన చైనా 'మితవాదవర్గం' మంత్రి శ్రీ లోలుంగ్‌చి తన నేరాన్ని ఒప్పుకొంటూ ఇచ్చిన వాఙ్మూలాన్ని పత్రికలు ఇవాళ ప్రకటించాయి. మరో మంత్రి చాంగ్ పో చున్ వాఙ్మూలం గురువారంనాడే పత్రికలు ప్రకటించాయి.

చాంగ్ పో చున్‌కు, తనకు భావాలలో మైత్రి ఏర్పడిందేగాని ఇందులో రాజకీయమైన పొత్తు ఏమీ లేదని శ్రీ లుంగ్‌చీ అన్నారు.

బ్రిటిష్, అమెరికన్ పత్రికలలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 20-వ మహాసభ తరువాత వెలువడిన వ్యాసాలు చదువగా, కమ్యూనిజం అంటే తనకు సందేహాలు బయలుదేరినట్లు ఆ సందేహాలు పోలండ్ హంగరీ సంఘటనలను చేసినవేలు మేధావంతులు పాశ్చాత్యరాజ్యాలకు పారిపోతున్నారని వార్తలను విన్నతరువాత మరీ ప్రబలమైనాయని శ్రీ లుంగ్ చెప్పారు.

తను, చాంగ్ కొందరు మేధావంతుల్ని కలుసుకొని, పాఠశాలల్లోను, విశ్వవిద్యాలయాల్లోనూ కమ్యూనిస్టు పార్టీ సంఘాలకు ఎదురుప్రచారం చేయడానికి చిన్న వర్గాలుగా యేర్పడ్డామని ఆయన ఒప్పుకున్నారు.

క్లుప్తంగా చెప్పాలంటే, పార్టీపైనాకు చాంగ్ పోకు అసంతృప్తి పెరగడంవల్ల కమ్యూనిజం అంటే శంకలు బయలుదేరడంవల్ల మేమిద్దరము ఏకమైనాం" అని ఆయన అన్నారు.

## ఈజిప్టు పత్తి: ఫ్రాన్సు కొనుగోలు

కైరో, జూలై 26: 120 లక్షల ఈజిప్షియన్ పౌన్ల విలువగల ప్రత్తిని, ఫ్రాన్సు ఈజిప్టునుండి కొంటోంది. ఈజిప్షియన్ నేషనల్ బ్యాంకు, ఒక స్విస్ బ్యాంకు యిందుకు సంబంధించిన వస్తుమార్పిడి ఒప్పందాన్ని కుదుర్చుకొన్నాయని, ఈజిప్టు ఆర్థికశాఖ ప్రతినిధి ఒకరు ఇవాళ చెప్పారు.

## ఐక్కు రాష్ట్రపతి సంతాప సందేశం

వాషింగ్టన్, జూలై 6: ఈ మధ్య అమెరికాలో శాలరేగిన తుపానువల్ల కలిగిన విపరీత ప్రాణ, నష్టాలకు శ్రీ ఐసెన్‌హోవర్‌కు రాష్ట్రపతి శ్రీ రాజేంద్రప్రసాద్ సంతాప సందేశం పంపించారు.

## ఒక కుటుంబ సమావేశం

### కామన్వెల్త్ ప్రధానుల సభపై మాక్మిలన్ భావం

లండన్, జూలై 7: కామన్వెల్త్ ప్రధానుల సమావేశాన్ని ఒక కుటుంబ సమావేశంగా బ్రిటిష్ ప్రధాని మాక్మిలన్ పేర్కొన్నారు. పదినిమిషాల బి.బి.సి. టెలివిజన్ గోష్ఠిలో కామన్వెల్త్ ప్రధానమంత్రుల సమావేశంపై మాట్లాడారు.

కొన్ని విషయాలపై ప్రధానులంతా ఏకీభావంతో ఉన్నారు. మరికొన్నిటిపై అంగీకారంలేదు. ఇది అందరూ భావిస్తున్నదే అన్నారు. అయితే అనేక విషయాలలో అంగీకారం, సుహృదయత్వం, స్నేహపూర్వకంగా అర్థం చేసుకోవడం ఉందన్నారు "కామన్వెల్త్‌లో వదికోట్లు ఉన్నాయనీ, వీటి వైశాల్యం 120 లక్షల చదరపు మైళ్ళు అనీ, అరవై ఏడున్నర కోట్లమంది ఉన్నారనీ గణాంక శాస్త్రజ్ఞుడు ప్రారంభిస్తాడు. కాని వైశాల్యం, జనాభాకంటేనంతో ఏకే వ్యవది ఉంది. ప్రధానమంత్రుల ప్రకటన ఆవేశపూరితంగా లేదనుకోవచ్చు. కాని ఇతర అంతర్జాతీయ సమావేశాలకు, కామన్వెల్త్ సమావేశాలకు ఎంతో భేదంఉంది. ఇతరచోట్ల జరిగే పని బ్రహ్మాండమైన ఉపన్యాసాలీయడం, లెక్కలేనన్ని తీర్మానాలు ఆమోదించడం. కాని కామన్వెల్త్ సమావేశాలవల్ల సాధించేది అమితంగా ఉండదు. ఐతే ఏదో సాధించాలన్నదే కామన్వెల్త్ సమావేశ లక్ష్యంకాదు. ఈ సభలలో ఆయాదేశాల అభిప్రాయాలను వెల్లడిచేస్తారు. పరస్పరం ఒకరి నొకరు అవగతం చేసికొంటారు. ప్రపంచంలోని అత్యంత ముఖ్య సమస్యలన్నిటిపైనా, వీరు స్వేచ్ఛగా అభిప్రాయాలను తెలుపుకుంటారు. అందువల్ల ఒకరి విధానంపై మరొకరి ప్రాబల్యం ఏర్పడుతుంది. ఇది ఒక కుటుంబ సమావేశం. కుటుంబంలోని వారు జరుపుకొనే చర్చలు స్నేహపూర్వకంగా, నిష్కల్మషంగా, హాయిగా, జీవంతో ఉంటాయి. ఐతే, ప్రతి విషయంలోనూ అంతా ఏకగ్రీవంగా ఉండాలనిలేదు. అదేరీతిని కామన్వెల్త్ ప్రధానుల సమావేశం కూడా. ఈ కుటుంబంలో విభిన్న మత, జాతి, చారిత్రక దేశాలు ఉండడంవల్ల ఒకరి దృక్పథం మరొకరు అవగతం చేసికొనే అవకాశం ఉంది. వ్యక్తి స్వాతంత్ర్యాన్ని, హక్కులు, ప్రజాస్వామ్య విధానాన్ని, అంతర్జాతీయ న్యాయసూత్రాన్ని అందరూ గౌరవిస్తారు, ఈ దృక్పథంతో పరస్పరాభిప్రాయాలను వ్యక్తంచేసికొన్నాం. ఈ సమావేశంలో కొన్ని రాజకీయ సమస్యలను కొన్ని ఆర్థిక సమస్యలను చర్చించాం. ఆయుధ విసర్జన, పశ్చిమాసియా, తూర్పుఆసియా వాణిజ్యం, కామన్వెల్త్ దేశాల అభివృద్ధి మొదలైన సమస్యలు ఎదురయ్యాయి. అన్ని విషయాలపైనా, ఎవరి అభిప్రాయాలు వారు స్పష్టం చేశారు. అందరి అభిప్రాయాలను అందరూ విన్నారు. అందువల్ల ఆయా సమస్యలపై తోటి కామన్వెల్త్ దేశాల భావాన్ని తెలిసికొని, తాము అవలంబించవలసిన సరియైన విధానం ఏమిటో ఆయా దేశాలు నిర్ణయించుకునే అవకాశం కలుగుతుంది" అని బ్రిటిష్ ప్రధానమంత్రి ప్రకటించారు.

శ్రీ నెహ్రూ, మెంజీస్‌లు ప్రపంచంలో అంతటా తెలిసి ఉన్న వ్యక్తులేననీ, పాకిస్తాన్ ప్రధాని సురావర్దీ, కెనడా ప్రధాని డైఫెన్‌బేకర్, మధ్య ఆఫ్రికా సమాఖ్య ప్రతినిధి వెలెన్‌స్కీ ఈ సమావేశాలకు మొదటిసారిగా వచ్చారనీ, ఘనా ప్రధాని శ్రీ డాక్టర్ సుక్రుమా క్రొత్త సభ్యులనీ అన్నారు. బ్రిటిష్ వలసలలో ఉన్న దేశాలు క్రమంగా కామన్వెల్తులో భాగస్వాములుగా చేరడం గర్వకారణమన్నారు. త్వరలోనే మలయాకూడా చేరుతుందనీ, ఇలాంటి సంఘటన ప్రపంచ చరిత్రలో ఎప్పుడూ జరగలేదనీ, ఇప్పుడు జరగడం లేదనీ వివరపరచారు. యూరప్‌తో బ్రిటన్‌కు ప్రత్యేకసంబంధాలున్నాయనీ, వీటిని మరింతదృఢంచేసికోవాలని భావిస్తున్నామనీ ఆయన చెప్పారు.

"గత పదిహేనురోజులలోను ఇతర దేశాల ప్రధానులతో తామువంభాషించే అవకాశమే కాకుండా, ఆయా ప్రధానులు పరస్పరం సంభాషణలు జరుపుకొనేందుకు వీలుకలిగింది. సాధారణంగా జరిగేచర్చలకన్నా, ఈ సమావేశంఫలితం విలువైంది. ప్రపంచ చరిత్రలో కామన్వెల్త్ అద్వితీయమైన సంస్థ. అంతేకాని, ఒకవర్గంకాదు. పైగా అదిఒక సైనిక కూటమికాని, ఒక వాణిజ్యకూటమిగానికాదు. దీనికిరోడు అవిస్థిరస్వరూపంకూడా కాదు. సర్వకాలాలలోను అది పెరుగుతోంది; అభివృద్ధిచెందుతోంది. అది ఒకకుటుంబం. దైనందినజీవితంలో కుటుంబం ఎంతో ప్రముఖస్థానం వహిస్తోంది. ఒకకుటుంబంలోనివారు ప్రపంచంలోని వివిధప్రాంతాలలో నివసించి,తిరిగికలిస్తే,ఆకుటుంబం మరింత సన్నిహితం ఔతుంది. దానికివిలువ మరీఅధికంగా ఉంది. ఇప్పుడుజరిగింది అలాంటికుటుంబ ఏకీకరణ. భవిష్యత్తులో విశ్వాసంతో ఈసమావేశం ముగిసింది" అని శ్రీ మాక్మిలన్ వెల్లడించారు.

# ఆయుధ సమస్యపై పెద్ద దేశాలకు మాట కుదరాలి

## ఇప్పుడు ఇంకొకరి ప్రవేశం అనవసరమని నెహ్రూ భావం

న్యూయార్కు, జూలై 7: "ప్రస్తుతం లండన్‌లో సాగుతున్న సమితి నిరాయుధీకరణోపసంఘం సమాలోచనలలో ఇతరులు పాల్గొనడం ఇప్పుడు అంత మంచిదికాదు" అని ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ కొలంబియా బ్రాడ్‌కాస్టింగ్ సిస్టం విలేఖరితో మాట్లాడుతూ అన్నారు.

జూలై 1వ ఈ గోష్ఠి టెలివిజన్ కోసం అని గ్రహించబడింది. నేడు దీన్ని ప్రసారంచేశారు. ఇందులో శ్రీ నెహ్రూ ఇలా అన్నారు: "ప్రస్తుతం జరుగుతున్న సమాలోచనల వివరాలు ఏమిటో నాకు తెలియదు. కాని పరిస్థితులనుబట్టి చూస్తే, ఏదో కొంతపని జరుగుతున్నట్లే కన్పిస్తోంది.

"ఇప్పుడు ఈ సమాలోచనలు ఇట్లా సాగి, ఏదోఒకసత్ఫలితానికి దారితీస్తే, సంతోషించవలసివుంది. అంతేగాని, ఇతరులను గూడా ఈ సమాలోచనలలో చేర్చుకోవడం ఇప్పుడు అంతమంచిదిగా తోచదు. కొత్తవారిని తీసుకురావడం అయితే బాగానే వుంటుంది. కాని అందువల్ల కొంత గందరగోళం గూడా జరగవచ్చు.

"ఏమైనా, ఈ ఆయుధాల వ్యవహారంలో ఒప్పందం కుదుర్చుకోవలసిన వారు, అగ్రరాజ్యాలవారు. దాన్ని వారు కుదుర్చుకోవాలి.

"ఈ నిరాయుధీకరణ వ్యవహారాన్ని సామరస్యంతో తేల్చుకోవలసిన సమయం ఆసన్నమైంది. స్నేహపూర్వకమైన అటువంటి వైఖరిని అనుసరిస్తే మంచిఫలితాలు కన్పిస్తాయి.

"ఈ స్నేహపూర్వక వైఖరి ఒక్కటే కన్పిస్తే ఏమీకాదు. అంతకంటే ముఖ్యమైంది ఇంకోటివుంది. అది, నిరాయుధీకరణం వ్యవహారంలో కొంత పనిజరగడం; అదిజరిగితే ప్రపంచంలో ఉద్రేకాలు చాలావరకు తగ్గుతాయి.

### ఏది స్నేహపూర్వకమైన వైఖరి?

"ఇంతకీ, స్నేహపూర్వకమైన వైఖరి అంటే ఏమిటి? ఒకవిధానాన్ని ప్రపంచించడానికి స్నేహభావంమార్గం కావాలి. అంతేగాని విధానం అంతా మారాలని కాదు. నా భావం ఇది. ఇతర దేశాలపట్ల మనం స్నేహభావంతో మెలగాలి. మన వైఖరి స్నేహపూర్వకమైందిగా వుండాలి. మనకు విరోధులు అనుకుంటున్న వారిపట్ల గూడా మన వైఖరి ఇదే పద్ధతిలో వుండాలి. వారిని ఈ పద్ధతిలో మన వైపుకు త్రిప్పుకోడానికి ప్రయత్నించాలి. మనలో స్నేహం వుంటే, అవతల గూడా స్నేహం కన్పిస్తుంది.

"నేను చాలా దేశాలు చూశాను. కమ్యూనిస్టు దేశాలు చూశాను. కమ్యూనిస్టు కాని దేశాలు చూశాను. ఈ అన్ని చోట్ల ప్రజలలో స్నేహభావం అన్నది తొణికిసలుగా కన్పించింది. స్నేహం వల్లనే సత్ఫలితాలు కలుగుతాయన్న విశ్వాసాలు వారిలో గాఢంగా కన్పించాయి.

"మనకు వారిలో ఎటువంటి అవరోధాలు వున్నా, వాటిని, అన్నింటిని, ఈ.స్నేహపూర్వకవైఖరిని అవలంబించి తొలగబెట్టుకో వలసివుంది. ఇది ఇప్పుడు మరీ అవసరం. అందుకు అనువైన సమయం ఇప్పుడు ఆసన్నమైంది."

రష్యాలో శ్రీ యుగం మాలటోవ్ ప్రభృతి నాయకులు ఇంకో మూడు రోజులకు బర్తరఫ్ అవుతారనగా, శ్రీ నెహ్రూతో ఈ గోష్ఠి జరిగింది. అప్పుడు ఈ విలేఖరి, శ్రీ నెహ్రూను చైనాను గురించి, రష్యాను గురించి, మావ్ సేటుంగ్ క్రొత్త సిద్ధాంతాన్ని గురించి ప్రశ్నించారు. ఈ ప్రశ్నకు సమాధానం ఇస్తూ శ్రీ నెహ్రూ కమ్యూనిస్టు దేశాల వైఖరులలో ఇప్పుడు కాఠిన్యం తగ్గినట్లు కన్పిస్తోందని చెప్పారు.

విలేఖరివేసిన ప్రశ్న ఇది: "మీరు కమ్యూనిస్టు దేశాల వ్యవహారాలనుచూస్తూవుం టేవుంటారు. శ్రీ మావ్ సేటుంగ్ ఒక సిద్ధాంతాన్ని ప్రపంచించారు. అది రష్యావారి సిద్ధాంతంకన్నా వేరుగా వుంది. కమ్యూనిస్టుల రాజ్యంలో పాలకులకు, ప్రజలకు వుండవలసిన సంబంధాలను గురించి రష్యాభావం ఒకటిగాను శ్రీ మావ్ సేటుంగ్ భావం ఒకటిగాను వుంది. మీ అభిప్రాయం ఏమిటి? ఆసియా కమ్యూనిజం వ్యాప్తి విషయంలో ఈ కొత్తసిద్ధాంతం వల్ల ఏర్పడే పరిణామాలు ఎట్లా వుంటాయి? కమ్యూనిజానికి ప్రజాస్వామ్యానికి మధ్యే మార్గాన్ని ఒకదాన్ని శ్రీ మావ్ దిద్దుతున్నారు. ఇందువల్ల మీ దేశంలో కమ్యూనిస్టు సమస్య మీకు ఏమన్నా కష్టంగా పరిణమిస్తుందా?"

శ్రీ నెహ్రూ: "ఇందువల్ల ఏదో పెద్ద పరిణామంవుంటుందని నేను అనుకోను. రష్యాలో జరుగుతున్న దానికి చైనాలో జరుగుతున్న దానికి కొంతం భేదావున్న మాట నిజమేకాని అదిఅట్లా జరగడం సహజం. అది సహజమైన పరిణామంగానే నాకు కన్పిస్తోంది అన్నారు.

"ప్రపంచంలో ఎప్పుడు ఎక్కడ విప్లవం జరిగినా, అక్కడ మనుష్య

## అణ్వస్త్ర పరీక్షలు

### రష్యా వైఖరి: ఒక బ్రిటిష్ సంస్థకు జోరిన్ హామీ

మాస్కో, జూలై 6: అణ్వస్త్ర, ఉదజని అస్త్ర పరీక్షలను నిలుపు చెయ్యడాన్ని గురించి త్వరితంగాఒప్పందాన్ని కుదుర్చుకోడాన్ని గురించి తాను చెయ్యగలిగిందంతా చేస్తానని సమితి నిరాయుధీకరణోపసంఘంలో రష్యా ప్రతినిధి శ్రీ జోరిన్, ఒక బ్రిటిష్‌సంస్థకు ఉత్తరం వ్రాసినట్లు టాస్ వార్తాసంస్థ నేడు ప్రకటించింది.

ఉదజని అస్త్ర పరీక్షా వ్యతిరేక సంఘం అని బ్రిటన్‌లో ఒక సంస్థ వుంది. ఆ సంస్థవారు శ్రీ జోరిన్‌కు ఈ పరీక్షల నిలుపుదలనుగూర్చి ఒక ఉత్తరం వ్రాశారు. ఆ ఉత్తరానికి శ్రీ జోరిన్ ప్రత్యుత్తరం వ్రాస్తూ, పై హామీతో పాటు ఈ పరీక్షల నిలుపుదలనుగురించి రష్యా చేసివున్న ప్రతిపాదనలనుగురించి గూడా ప్రస్తావించారు. బ్రిటన్ అమెరికాలు, ఈ అస్త్ర పరీక్షలను నిల్పడానికి ఆమోదాన్ని చూపించిన వెంటనే, రష్యా ఆ పరీక్షలను నిలిపివెయ్యడానికి సిద్ధంగా వున్నదని చెప్పారు. తక్కిన నిరాయుధీకరణ వ్యవహారంతో సంబంధం లేకుండా, ఈ అస్త్రపరీక్షా వ్యవహారాన్ని తేల్చుకోవాలని, వీటిని నిలిపితే, తక్కిన అన్ని సమస్యలు తేలిగ్గా తీరుతాయనిగూడా శ్రీ జోరిన్ ఈ ఉత్తరంలో స్పష్టంచేశారు.

## దక్షిణ కొరియాకు యుద్ధ సామగ్రి

### అమెరికా చర్యపై రష్యా విమర్శ

లండన్, జూలై 6: కొరియా యుద్ధ విరమణ ఒప్పందాన్ని భగ్నం చేస్తూ, తూర్పు ఆసియాలో ఉద్రిక్తత తగ్గకుండా ఉంచే విధానాన్ని అమెరికా అనుసరిస్తున్నదని రష్యా నిందించింది. రష్యా ప్రభుత్వ ప్రకటనను మాస్కో రేడియో యివాళ ప్రసారంచేసింది.

ఆధునికమైన యుద్ధ సామగ్రిని దక్షిణ కొరియాకు అమెరికా సరఫరా చేస్తోందని, చైనాకూడా యిదే పద్ధతి అనుసరిస్తే, శాంతికి ముప్పుకలుగుతుందని యీ ప్రకటనలో రష్యా హెచ్చరించింది.

దక్షిణ కొరియాలో అమెరికా విధానం పట్ల అసమ్మతి తెలుపుతూ, చైనా ప్రభుత్వము ఉత్తర కొరియా ప్రభుత్వము పదే పదే వెల్లడించిన అభిప్రాయాలను రష్యా పూర్తిగా సమర్థిస్తున్నదని యితరులను రెచ్చగొట్టేందుకు అమెరికా పైన్యాలు చేస్తున్న పనులు కొరియా యుద్ధ విరమణ సంధిని భగ్నం చేసి, దక్షిణ కొరియాను అమెరికాకు అణ్వస్త్ర స్థావరంగా మార్చాలనే ఉద్దేశ్యమని యీ ప్రకటనలో ఉంది. ఈపనులవల్ల కలిగే ఫలితాలకు అమెరికాయే పూర్తిగా బాధ్యత వహించాలని రష్యా హెచ్చరించింది.

## హంగరీ సమితి ప్రతినిధివర్గం

### ఒక సభ్యుని బహిష్కారం

వాషింగ్టన్, జూలై 6: ఐక్యరాజ్య సమితిలోని హంగరీ ప్రతినిధివర్గంలో, ఒక సభ్యుణ్ణి అమెరికా ప్రభుత్వం తమ దేశంనుండి వెళ్ళగొట్టింది. రాయబార ప్రతినిధిగా తనకు ఉన్న హక్కులను అతిక్రమించి సేకరించకూడని సమాచారమేదో సేకరిస్తున్నాడని అమెరికా యీ చర్య తీసుకొన్నదని, అధికారులు ఇవాళ చెప్పారు.

దేశ బహిష్కృతుడైన ఆ ప్రతినిధి, పాల్ రాల్ నారం రోజులకుముందే అమెరికా విడిచి వెళ్ళాడు.

టు ముందు తాము ఏదో దైవకార్యాన్ని నిర్వహిస్తున్నట్లు వ్యవహరిస్తారు. క్రమంగా ఆభావం కాఠిన్యం తగ్గుతుంది. కాని రష్యాలో ఆ కాఠిన్యం తగ్గడానికి చాలా కాలంపట్టింది. ఇది నిజంగా ఆశ్చర్యకరమైన విషయం, అయినా అందుకు వారికి తగినకారణం వుంది. ఒక అంతర్యుద్ధం, రెండు ప్రపంచయుద్ధాలను వారు ఎదుర్కొనవలసి వచ్చింది.

"ఏమైనా, ఇప్పుడు జరుగుతున్నది ఏమిటో, అతిసహజంగా జరుగుతోంది. అదే అందరికీ కావలసింది," అని శ్రీ నెహ్రూ చెప్పారు.

## ప్రపంచ యుద్ధకాలం వ్యవహార పత్రాలు

### అమెరికాస్టేటుశాఖ ప్రకటన

వాషింగ్టన్, జూలై 1: రెండవ ప్రపంచ యుద్ధంలో ఇంకా దిగకముందు, అప్పటి అధ్యక్షుడు శ్రీ రూజ్వెల్టు, ఇటలీ నియంత శ్రీ ముసోలినీకి ఇచ్చిన సలహా, విషీఫ్రాన్సునుంచి అమెరికా రాయబారులు పంపిన నివేదికలు, అమెరికా నౌకలను బ్రిటిష్ నౌకాబలంతనిఖీ చెయ్యడాన్ని గూర్చి శ్రీ చర్చిల్ నివేదికలు పంపడం మొదలైన అన్ని విషయాలను వెల్లడిచేసే వ్యవహార పత్రాలను, మొత్తం, 916 పేజీల గ్రంథాన్ని అమెరికా విదేశాంగశాఖవారు ప్రకటించారు.

యుద్ధంలో ఇంకొనెలలో ఇటలీ ప్రవేశిస్తుందనగా, శ్రీ రూజ్వెల్టు, శ్రీ ముసోలినీకి ఇట్లా ఒకసందేశాన్ని పంపించారట: "ఈ యుద్ధంతో మీరు సంబంధం పెట్టుకోకండి. దానికి దూరంగా ఉండండి. ఒకరిని బెదిరించడం మొదలైన పనులు చేయకండి. దండయాత్రలకు పూనుకోకండి. అప్పుడే ప్రపంచాన్ని మీరు రక్షించగలుగుతారు. చరిత్రలో మీ పేరు కలకాలం నిలుస్తుంది."

రెండో ప్రపంచ యుద్ధంలో అమెరికా ప్రవేశించకముందు,అమెరికావిదేశ విధానం స్వరూప లక్షణాలు ఏమిటో ఈ పత్రాలు తెలియజేస్తున్నాయి. ఇంగ్లండు చాలా భాగం మార్షల్ పెటేన్ అధికారం ఫ్రాన్సులో చెల్లుతున్నప్పుడు, అక్కడి అమెరికా రాయబారులు పంపిన నివేదికలలో నిండివుంది. అప్పుడు శ్రీ లావెల్ ఫ్రెంచి విదేశాంగ మంత్రిగా వుండేవాడు. ఆయన ఆ యుద్ధంలో జర్మనీయే గెలుస్తుందన్న నమ్మకంలో వుండేవాడు. ఎవరన్నా బ్రిటన్ గూడా గెల్వవచ్చు నంటే "ఎప్పుడుకి ఇంకో శతదసంవత్సరాల యుద్ధంలోన్నా" అనేవాడు.

జర్మనీ ఓడిపోయిన అనంతరం శ్రీ లావెల్‌ను ఉరితీశారు.

ఈ యుద్ధంలో అమెరికా అవలంబించిన వైఖరి విషీ ఫ్రాన్సుకు ఎంతమాత్రం నచ్చలేదు, బ్రిటన్‌ను,అమెరికా బలపరచడం శ్రీ లావెల్‌కు ఎంతమాత్రం నచ్చలేదని,ఈ పత్రాలవల్ల తెలుస్తోంది. అమెరికా ఈ వైఖరి శ్రీ లావెల్‌కు "దిగ్భ్రాంతిని, బాధను, ఆశ్చర్యాన్ని" కలిగించింది. "ఐరోపాను గూర్చి చాలా తప్పుడు భావాలు అమెరికా పెట్టుకున్నదని" ఆయన వ్యాఖ్యానించాడు, అనేకసార్లు, ఫిర్యాదులు చేశాడు.

## అర్జెంటినా వెనుజులా విషమ సంబంధాలు

బ్యూనస్‌ఎయిరస్, జూలై 6: అర్జెంటీనా, వెనుజులా దేశాలమధ్య సంబంధాలు తీవ్రంగా చెడిపోయేట్లున్నాయి. వెనుజులాలోని తమ రాయబారిని అర్జెంటీనా స్వదేశానికి పిలిపించింది.

అర్జెంటీనా మాజీ అధ్యక్షుడైన పెరాన్ ప్రస్తుతం వెనుజులాలో తలదాచుకొంటున్నాడు. ఆయనను దేశంనుండి వెళ్ళగొట్టాలని అర్జెంటీనా ప్రభుత్వం వెనుజులా ప్రభుత్వాన్ని అడిగింది. శ్రీ పెరాన్ వెనుజులా రాజకీయమైన ఉద్యమమేదో తీవ్రంగా సాగిస్తున్నాడని తెలిసి అర్జెంటీనా అధికారులుకూడా తెలిపింది ఉభయదేశాలమధ్య సంబంధాలు విషమించడానికి ఇది కారణం.

## చెకోస్లావేకియాలో సంచలనం

### తూ. యూరప్‌కమ్యూనిస్టు నాయకుల సమావేశం!

ప్రాగ్, జూలై 6: రష్యాలో, స్టాలినిస్టు నాయకవర్గంపై జరుగుతున్న దాడులను గురించి చెకోస్లావేకియా అంతటా పార్టీలు రహస్య చర్చలు తీవ్రంగా సాగిస్తున్నాయి.

సోవియట్ రష్యా ప్రధాని శ్రీ బుల్గానిన్, కమ్యూనిస్టు కార్యదర్శి శ్రీ కృశ్చేవ్ బుధవారంనాడు పెద్ద ప్రతినిధివర్గంతో సహా ప్రాగ్ నగరం వస్తున్నారు. వీరితోపాటు సోవియట్ రహస్య పోలీసు దళాధిపతి జనరల్ ఇవాన్ సెరోవ్‌కూడా వస్తున్నారు.

ఇంతవరకూ మాస్కోపట్ల మొదటినుంచీ చెకోస్లావేకియా పార్టీ అతి విధేయతతో నేఉన్నది.1953లో రుడాల్ఫ్ స్లాన్‌స్కీని టిటోవాది అనీ దేశద్రోహి అనీ ఉరితీసిన తరవాత ఈనాటి వరకూ ఆ దేశంలో పార్టీ నాయకత్వం ఎలాటి మార్పూ లేకుండానే వుంది.

తూర్పుయూరప్ రాజ్యాల కమ్యూనిస్టుపార్టీల ప్రతినిధులు సమాలోచనల కోసం సోమవారంనాడు ప్రాగ్ వస్తున్నారని, పారిస్‌లో ప్రచారమయిన వార్త ఇక్కడ (ప్రాగ్)లో ధ్రువపడలేదు.

## కైరోలో అణుశక్తి ఉత్పాదక కేంద్రం

### రష్యా సహాయంతో స్థాపన

లండన్, జూలై 6: కైరోలో మొట్టమొదటి అణుశక్తి ఉత్పాదక కేంద్రం నిర్మాణం దాదాపు పూర్తి కావచ్చిందనీ, ఇది రష్యా సహాయంతో నిర్మితమయిందనీ, ఇవాళ మాస్కో రేడియో తెలియపరచింది.

నిర్మాణం పూర్తి అయిన తరవాత దానిని ఈజిప్షియన్ అణువాస్త్ర నిపుణులకు అప్పగించేస్తారట. ఈ నిపుణులలో ఇద్దరు స్త్రీలుకూడా ఉన్నారట.

## భారత ముస్లింలను గెంటుతున్నారట

### పాక్ ప్రభుత్వం ప్రచారం

కరాచీ, జూలై 8: భారత దేశ పౌరులైన ముస్లింలను దేశంలోంచి గెంటివెయ్యడానికి ఒక పద్ధతిని భారత ప్రభుత్వం అనుసరిస్తున్నదని, ప్రమాణ పత్రాలులేని పాకిస్తానీలుగా వారిని నిర్ణయించి, దేశం విడచిపొమ్మని ఉత్తర్వులు జారీచేస్తున్నదని పాక్ సమాచారశాఖ ఒక ప్రకటనచేసింది.

ఈప్రకటనకు ఆధారంగా కలకత్తాలోని స్టేట్స్‌మన్ పత్రికలోను, టైమ్సు ఆఫ్ ఇండియా పత్రికలోను పడిన వార్తలను కొన్నింటిని ఈప్రకటనలో పేశాఖ ఉటంకించింది. అయితే ఆ వార్తల్లో మాత్రం, ఆ ముస్లింలు, భారతీయులనిలేదు; పాకిస్తానీలని వుంది. అయినా ఈ సమాచారశాఖకు అదిపట్టలేదు.

ఈమధ్య పాకిస్తాన్ ప్రభుత్వం, తనదేశంలోవున్న భారతీయులను గెంటివేయడానికి పూనుకుంది. దాన్ని గూర్చి విమర్శలు రాగా, భారతదేశం అట్లాకాక, అసలు ముస్లింలనే పాకిస్తానీలనిచెప్పి గెంటివేస్తున్నట్లు ఇప్పుడు ఈప్రచారం మొదలుపెట్టింది. 1939 విదేశీయుల రిజిస్ట్రేషన్‌చట్టాన్ని 1946 విదేశీయుల చట్టాన్ని, ఇందుకోసమే, భారతదేశం సవరించినట్లు, సంవత్సరంనుంచీ భారతదేశంలో ఈపని జరుగుతూ వుంటే, తాము ఇప్పుడే ఒకవారంరోజుల క్రిందటే, ఈపనిని మొదలుపెట్టినట్లు ఈ ప్రకటనలో తేటతెల్లచేసుకో చూసుకుంటున్నది.

## జోర్డాన్‌కు సహాయం చెయ్యకపోతే

### ఈజిప్టు సిరియాలకు దెబ్బ

అమ్మాన్, జూలై 6: జోర్డాన్‌ను గూర్చి విరోధంవహించడంవల్ల వచ్చే ప్రమాదాలు ఏమిటో, ఈజిప్టు, సిరియాలు గ్రహించలేకుండా వున్నాయంటూ జోర్డాన్ విదేశాంగమంత్రి శ్రీ సామియూరిఫాయ్ నేడు ఒకవాదాన్ని ప్రతిపాదించారు.

ఈ రెండు దేశాలు,మమ్మల్ని గురించి అబద్ధాలు ప్రచారం చేస్తున్నాయి, జోర్డాన్ అరబ్బులకు దూరం అయిందని అంటున్నాయి. ఇదంతా చూస్తుంటే, ఏవో విదేశీశక్తులు వెనక వుండి, ఈ దేశాలచేత ఈపనులన్నీ చేయిస్తున్నాయని మాకు అనుమానంగావుంది ఆయన అన్నారు.

సిరియా, ఈజిప్టులు ఇస్తామన్న డబ్బును, జోర్డాన్‌కు ఇవ్వకపోతే, అంతర్జాతీయంగా ఆ ఆ రెండుదేశాల పరువుపోతుందని శ్రీ రిఫాయ్ వాదించారు.

## జోర్డాన్‌నుంచి బ్రిటిష్‌సేన ఖాళీ

అమ్మాన్, జూలై 6: జోర్డాన్‌లోని బ్రిటిషుసేనల ఆఖరిజట్టు యీ రాత్రి ఆకాబా సముద్రతీర స్థావరం ఖాళీచేసి వెళ్లింది. ఇంతటితో, 40 ఏళ్ళగా బ్రిటిషుసేనకు జోర్డాన్‌కు ఉన్న సంబంధం తీరిపోయింది.

## మలయా రాజ్యాంగానికి చైనా సంస్థ ఆమోదం

కౌలాలంపూర్, జూలై 7: మలయా రాజ్యాంగ ముసాయిదాను మిశ్రమ మంత్రి వర్గంలోని చైనా సంస్థ ఆమోదించింది. దీనితో ప్రభుత్వంలోని మూడు పక్షాలు రాజ్యాంగాన్ని ఆమోదించినట్లే. ఈ ముసాయిదాను ఈ నెల పదవ తేదీన శాసనసభలో ప్రవేశపెడతారు. ఈ ప్రభుత్వంలో ఐక్య మలయా జాతీయసంస్థ, మలయా భారతీయ కాంగ్రెస్ సంస్థ కూడా భాగస్వాములుగా ఉన్నాయి.

## కమ్యూనిస్టు దేశాల దూతలు

### పిలిపించినట్లు బ్రిటిష్ ప్రభుత్వానికి తెలియదట

లండన్, జూలై 7: లండన్‌లోని మూడు తూర్పు యూరప్‌దేశాల రాయబారులను పిలిపించినట్లు తమకు తెలియదని బ్రిటిష్ విదేశాంగ కార్యాలయ ప్రతినిధి ఒకరు అన్నారు. సాధారణంగా ఆయా ప్రభుత్వాలతో సంప్రదింపులు జరిపేందుకు రాయబారులు వెడితే తమకు తెలియదనీ, వారిని పదవులనుండి తొలగించినప్పుడే తెలుస్తుందనీ అన్నారు.

లండన్‌లోని జెకోస్లావేకియా, హంగరీ, బల్గేరియా దేశాల రాయబారులు కనిపించలేదనీ, మరొకరిని కూడా రమ్మనమని ఉత్తర్వు వచ్చిందనీ లండన్‌లోని న్యూయార్క్ టైమ్స్ పత్రిక విలేఖరి తెలిపాడు. జెక్ రాయబారి రుజెక్ మొదట వెళ్ళినట్లుగా ఈ పత్రిక వ్రాసింది.

శ్రీ రుజెక్ లండన్‌లో మూడుసంవత్సరాలు ఉన్న తరువాత, ఒక నెలక్రితం బ్రిటన్ వదలి వెళ్ళారని లండన్‌లోని జెక్ రాయబార కార్యాలయ ప్రతినిధి అన్నారు. ఒకదేశంలో రాయబారిగా ఒకరిని మూడు సంవత్సరాలపాటు ఉంచుతారు.

## ప్రణాళికకు హాలండు ఆర్థిక, సాంకేతిక, సహాయం?

### నెహ్రూ పర్యటన ఫలితంగా డచ్చి వైఖరిలో సంస్కారం

హేగ్, జూలై 7: భారతదేశం రెండో పంచవర్ష ప్రణాళికకు హాలండు నుంచి ఆర్థిక, సాంకేతిక సహాయం బాగా లభించే సూచనలు కన్పిస్తున్నాయి. శ్రీ నెహ్రూ ఇక్కడికి వస్తున్న సందర్భంలో ఏర్పాటైన కార్యక్రమం, ఈ విషయాన్ని గూర్చి మాటలు వడిచేందుకు, హాలండు చేయగల సహాయ స్వరూపాన్ని, ఆయన స్వయంగా తెలుసుకోగలందుకు వీలుగా ఏర్పాటు చేయబడటం గమనించదగిందిగా వుంది.

తన దేశంలో వుండే రెండురోజులలోను, శ్రీ నెహ్రూకని నిర్ణయించిన కార్యక్రమం, హాలండులో వున్న సర్వమైన అభివృద్ధి కృషులను, ఆయన చూడ్డానికి వీలుగా డచ్చి ప్రభుత్వం ఏర్పాటు చేసింది. శ్రీ నెహ్రూ ఈ రెండురోజులలోను, రోటర్‌డాంను చూస్తారు. ఇది ఐరోపాలోకల్లా పెద్ద రేవుపట్టణం. ప్రపంచంలో రెండోది. ఆ తర్వాత ఆయన డెల్టా ప్రాజెక్టును, జూడర్ జీ ఏర్పాట్లను దర్శిస్తారు. ఈ ఏర్పాట్లతో, హాలండు, సముద్రంనేలను ఎంతగానో, సాగులోకి తెస్తోంది. ఇంతేగాక, శ్రీ నెహ్రూ ఇక్కడ, సహకార సంస్థలను, ఇతర అభివృద్ధి సంస్థలను ఎన్నింటినో చూస్తారు.

శ్రీ నెహ్రూకోసం ఏర్పాటుచేసిన విందులను, సన్మానాలను, డచ్చి వణిక్కులను, పారిశ్రామికులను ప్రభుత్వం అధికంగా ఆహ్వానిస్తోంది. భారతదేశం పంచవర్ష ప్రణాళికకు డచ్చి సహకారాన్నిగూర్చిగూడా మాటలు వివ్పుతున్నాయి.

ఇంతేగాక, శ్రీ నెహ్రూ ఈ రాకవల్ల, ఈరెండు దేశాలమధ్య స్నేహానుబంధం అధికం అవుతుందని గూడా, డచ్చి రాజకీయవేత్తలు భావిస్తున్నారు. ఈరెండుదేశాలు, పరిమితి, బహు విషయాలలో, వేరు వేరువర్గాలకు చెంది నవై, ఘర్షణపడుతూ వచ్చాయి. ఐతే, అవి, ఈ స్నేహానికి అడ్డురానక్కరలేదన్న భావం ఇప్పుడు ఇక్కడ అధికం అవుతోంది. భారతదేశానికి సైనిక కూటాలు అవి నచ్చవు. అయినా, అట్లాంటిక్ మండలంలోవున్న నార్వే,డెన్మార్క్ - భారతదేశాల మధ్యవున్న స్నేహం వీరికి ఆదర్శవంతమై కన్పిస్తోంది.నార్వే, డెన్మార్క్‌లు రెండూ అట్లాంటిక్ మండలంలోదేశాలు. అయినా ఆరెండు రాజ్యాలకు, భారతదేశంతో వున్న స్నేహం గాఢమైందిగావుంది. ఇప్పుడు హాలండుగూడా, అటువంటిస్నేహాన్నే ఎందుకు సంపాదించుకోరాదు అని ఇక్కడి రాజకీయవేత్తలు వాదిస్తున్నారు. "మా స్నేహితులు, ఏమిటో మీకు వున్నారు. మా స్నేహితులు ఏమిటో, మాకు వున్నారు. మీ స్నేహితాన్ని, మీరు వుంచుకోండి, మా స్నేహితాని మేము వుంచుకుంటాం. అట్లా వుంచుకుంటూ మనం గూడా స్నేహంగా వుందాం" అన్న వైఖరి ఇప్పుడు డచ్చి రాజకీయ వేత్తలలో కలవత్తి కన్పిస్తోంది.

ఈ స్నేహం చెయ్యడం సందర్భంలోనే, వీరు, భారత పంచవర్ష ప్రణాళిక సంగతిని ఎత్తుకుంటున్నారు. ఈ ప్రణాళికకు, ఆర్థికంగాను, సాంకేతికంగాను, హాలండు గూడా సహాయం చెయ్యదలదంటున్నారు. భారతదేశానికి, హాలండుకు, ఏవో విషయాలలో అభిప్రాయభేదాలువున్నా, ఈ రెండు దేశాలు, ప్రజాస్వామికమైన దేశాలు. రెండు దేశాలకు ప్రజాస్వామిక వ్యవస్థలలో నమ్మకం వుంది. అందువల్ల ఈ సహాయాన్ని హాలండు చెయ్యడానికి, భారతదేశం ఆ సహాయాన్ని స్వీకరించడానికి, అభ్యంతరంఏమీవుండనవసరం లేదంటున్నారు.

ఈ కార్యక్రమంలో రాజకీయసమాలోచనలకని సమయం కేటాయింపైలేదు. అయినా సందు చూసుకొని, ఈ రెండు దేశాల నాయకులు, ఈ రెండు దేశాలకు ఆసక్తి వున్న సమస్యలను గూర్చి చర్చించగలరని అభిజ్ఞులు భావిస్తున్నారు.

శ్రీ నెహ్రూతో హాలండుకు, శ్రీమతి విజయలక్ష్మి శ్రీ ఎన్. ఆర్. పిళ్ళె, శ్రీ ఎం. ఓ. మత్తయి, మరో ఇద్దరు కార్యదర్శులు వస్తారు. వీరి విమానం ఇక్కడికి సమీపంలో వున్న షైకన్‌బర్ విమానాశ్రయంలో దిగుతుంది. భారతీయ వర్గాలవారు, శ్రీ నెహ్రూ ఈ రాకకు రాజకీయప్రాముఖ్యం ఏమీ లేదని, మర్యాదమాత్రమైన పర్యటనం మాత్రమేనని అంటున్నారు.

ఇక్కడ శ్రీ నెహ్రూ కార్యక్రమంలో రాటర్‌డాం మొదలైన వాటిని చూడ్డమేగాక, డచ్చి ప్రభుత్వం ఇచ్చే విందును ఆరగించడం, రాణీ జూలియానాను చూడటం, పత్రికా విలేఖరులతో గోష్ఠి మొదలైన అంశాలుగూడా వున్నాయి. ఇందులో ఇంకో విచిత్రమైన అంశం గూడా వుంది. శంకర్స్ వీక్లీ నడిపించిన అంతర్జాతీయ శిశు చిత్రాల పోటీలో, పలువురు డచ్చి పిల్లలకు ప్రత్యేక బహుమతులు లభించాయి. శ్రీ నెహ్రూ ఆ బహుమతులు, వారికి ఇప్పుడు అందచేస్తారు.

